# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు–కొమరగిరి కృష్ణమోహనరావు

ఆగష్టు 1993

సంపుటి : 9

సంచిక : 8



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



| | |
|---|---|
| విడి ప్రతి | : రు. 4-00 |
| సంవత్సర చందా | : రు. 48-00 |
| 4 సం॥ల చందా | : రు. 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. 600-00 |
| పోషకులు | : రు. 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం :

'యువకిశోరం' ఖుదీరాంబోసు



# ప్రేమమూర్తి మీద అభాండాలా! పవిత్రమూర్తి మీద నిందలా!

కొమరగిరి కృష్ణమోహనరావు

ప్రశాంతినిలయంలో జూన్ 6వ తేదీన జరిగిన సంఘటనను ఆసరాగా తీసుకొని శ్రీ సత్యసాయిబాబా వారిని అరెస్టు చేయాలని, సాయి ట్రస్టు ఆస్తులను జాతీయం చేయాలని, బాబాను బహిరంగంగా విచారించాలని హేతువాదులు, నాస్తికులు ప్రకటనలు చేస్తున్నారు, సదస్సులలో తీర్మానాలు చేస్తున్నారు. "తాడిచెట్టు ఎందుకెక్కావంటే, దూడ మేతకు" అన్నట్లున్నది వీరి ప్రకటనలు, తీర్మానాలు అంతేకాదు వీరు చేసే తీర్మానాలు అసలు విషయాన్ని పెడమార్గం పట్టించటానికి ఉపయోగపడతాయిగాని, అసలు కుట్రలను బట్టబయలు చేయటానికి ఏమాత్రం ఉపయోగపడవు. నాస్తికులు, హేతువాదులు, ఆధ్యాత్మికత అంటే గిట్టనివారు, సనాతన ధర్మమంటే ఏమాత్రం గౌరవం లేనివారు మాత్రమే యిటువంటి ప్రకటనలు చేస్తుండటం పరిపాటి. ఈ ప్రకటనలు చేస్తున్నవారుగాని, సదస్సులు నిర్వహించి బాబాను విమర్శిస్తూ తీర్మానాలు చేసేవారిలోగాని చాలామంది పుట్టపర్తి చూచే మహద్భాగ్యం వారికి కలిగి ఉండదు అక్కడ ప్రగతిని కళ్ళారా చూచి ఉండరు అక్కడి పరిస్థితిని అధ్యయనం చేయకుండా, అవగాహన చేసుకొనకుండా ఏకపక్షంగా, దూరంగా ఉండి ప్రకటనలు చేయటం ఏమాత్రం విజ్ఞత అనిపించుకోదు.

వీరు సాయి ట్రస్టు ఆస్తులను జాతీయం చేయాలంటున్నారు. ఈనాడు ప్రభుత్వరంగం (Public Sector)లో నడుపబడుతున్న సంస్థల నిర్వాకం అందరికీ తెల్సిందే వేలాది కోట్ల రూపాయలు ఏవిధంగా దుర్వినియోగమవుతున్నాయో వేరే చెప్పనవసరంలేదు ఈనాడు భారతదేశ వ్యవస్థ కుంటుపడటానికి కారణం ముఖ్యంగా ప్రభుత్వరంగంలో నిర్వహించబడుతున్న సంస్థల వలన కాదా? ఒకవైపున అనుభవం ఆవిధంగా ఉంటే, మంచిగా నడుస్తున్న సంస్థను, వ్యవస్థను కూలద్రోయటానికి పదిమందికి ఉపయోగపడుతున్న సంస్థను, బీద పేద ప్రజలకు ఉపయోగపడుతున్న వ్యవస్థను పాడుచేయటానికా వీరి ప్రయత్నం! దీనిని విజ్ఞతగలవారెవరూ అంగీకరించరు.

బాబా ఆధ్యాత్మిక చింతనతో ఏమాత్రం అంగీకరించనివారు సహితం, విద్య, వైద్య, సేవారంగములలో వారు చేబట్టిన ప్రజాహిత కార్యక్రమాలను గమనించి ప్రశంసిస్తున్నారు అట్టి వారిలో ప్రముఖ మార్క్సిస్టు నాయకులు కీ. శే. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు ఉన్నారనే విషయం చాలామందికి తెలియకపోవచ్చును ఒకపర్యాయం బాబాగారి విద్యాసంస్థలను అధ్యయనం చేయటానికి వచ్చిన వారిలో శ్రీ సుందరయ్యగారుకూడా ఉన్నారు. అప్పుడు వారు బాబాతో "నా పేరు సుందరయ్య, నేను కమ్యూనిస్టును అండీ!" అన్నారుట. అప్పుడు బాబా సుందరయ్యతో "నాకు తెలుసు, Come you Next" అన్నారుట. 5 సం.లు తరువాత అనగా వారు ఎన్నికలలో ఓడిపోయిన తరువాత అనంతపురం శ్రీ సత్యసాయి మహిళా కళాశాలలో బాబాగారిని కలిసి "మీరు చేసే పనులు ఏ ప్రభుత్వంగాని, ఏ వ్యక్తిగాని

Individual చేసేది కానేకాదు. ఇదే పెద్ద Divinity (దివ్యత్వం). ఇన్ని Powers (అధికారములు) ఉండి, మంత్రులుగా ఉండి, కోట్ల రూపాయలు చేతిలో ఉండి ఏమీ మంచి పనులు చేయలేకపోతున్నారు. ప్రజల డబ్బును ప్రజలకందించటానికి వెనుకంజ వేస్తున్నారు. అయితే ఇక్కడజరుగుతున్న ప్రగతి ఆశ్చర్యకరం. ఇదే Biggest Miracle (అత్యంత అద్భుతం)" అని సుందరయ్యగారు ఆశ్చర్యమును వెలిబుచ్చగా అప్పుడు బాబా "ఆనాడు నీకు చెప్పింది దీనికోసమే. Come you Next అని అన్నాను గదా!" అని అన్నారుట భగవాన్ బాబా వారు కేవలం విద్యారంగంలో చేస్తున్న కృషి ఎంతటిదో ఈ ఒక్కసంఘటనచాలు ఈనాడు వైద్యరంగంలో బాబా నెలకొల్పిన 'సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్' మరో అద్భుతం. వారిమహిమాన్విత దివ్యశక్తికి, సంకల్పానికి అది నిదర్శనం. అది ఆసుపత్రి కాదు అది ఒక దేవేంద్రభవనం పేద ప్రజలకు ప్రాణభిక్షను ప్రసాదించేటటువంటి ఆశాసౌధం అది. జీవితం మీదనే నిరాశ చెందిన నిర్భాగ్యుల పాలిటి ఆశాకిరణం అది వైద్య చికిత్సాకేంద్రం వ్యాపారకేంద్రం కాదు రోగ నివారణ గావించుకోలేక జీవితం మీద విరక్తి చెంది, నిరాశా నిస్పృహలతో అలమటిస్తున్న అభాగ్య, నిర్భాగ్య, పీడిత, దళిత ప్రజలపాలిటి "ప్రాణదాత" భగవాన్ బాబా. ప్రపంచ ఆరోగ్యసంస్థ కలలుగంటున్న వ్యవస్థకు వాస్తవిక రూపకల్పన చేసిన మహా శిల్పి బాబా. అటువంటి ప్రేమమూర్తి మీద అభాండాలు వేయటానికి ప్రయత్నించటమంటే పదినెలలు మోసి, కని, పెంచిన మాతృదేవికి ద్రోహం చేయటంలాంటిదే అటువంటి పవిత్రమూర్తి మీద నిందలు మోపటానికి మించిన ఆత్మవంచన మరొకటి లేదు బీదప్రజలకు బాబా చేస్తున్న సేవను విశాల హృదయంతో ప్రశంసించటం చేతకానివారిని సహజంగా పాషాణ హృదయములే అని చెప్పవలసివస్తుంది. మానవత్వం ఏమాత్రం వారికి లేదని చెప్పవలసివస్తుంది. అట్టివారు తీయని మాటలు మాత్రం చెబుతుంటారు. చేతలలో మాత్రం సూన్యం. ఒక పద్యాయం బాబా అట్టి వారిని గురించి చక్కగా చెప్పారు.

"మాటయందు తీపి మనసులోన చేదుండ
మంచికాదు మీకు మచ్చగాని
మచ్చలేని బ్రతుకె మహిలోన చెల్లురా
ఉన్నమాట తెలుపుచున్నమాట"

కొంతమంది పైకి తీయని కబుర్లు చెబుతుంటారు. నిలువెల్లా విషమే. అట్టివారిది వృశ్చిక (తేలు) స్వభావం. తేలు చూచినదానినల్లా తన కొండితో కుడుతుంటుంది. వీరుకూడా ప్రతి దానిని, ప్రతివారిని విమర్శిస్తుండటమే వీరి లక్ష్యం. మంచిని ప్రశంసించే విశాల హృదయం వీరికి ఉండదు రంధ్రాన్వేషణే వీరి పరమావధి. అసూయ, ఈర్ష్య, ద్వేషం వీరి ఆయుధాలు. ఆ ఆయుధాలను ప్రయోగించి సమాజంలో అల్లకల్లోలాలను సృష్టించడం వీరి లక్ష్యం అరాచకత్వాన్ని సృష్టించి సంతోషించడం వీరి స్వభావం. ఇటువంటివారు సమాజం పాలిటి చీడపురుగులు. ఇటువంటి కుత్సిత స్వభావంగల వారిని గురించి బాబావారు ఒక పర్యాయం చక్కగా చెప్పారు. వారి వలన ఎంత ప్రమాదమో వివరించారు

"తేలు విషముకన్న తెంపరాకులకన్న
పదును కత్తికన్న పాముకన్న
మత్సరంబుగల మనుజుండు ఇలలోన
కుత్సితుండు వాడె తుచ్ఛితుండు"

తేలు, తెంపరాకులు, పదునుకత్తి, పాముకన్నా ఈ చీడపురుగుల వలననే సమాజానికి ఎక్కువ ప్రమాదం. ఇట్టివారిని విజ్ఞతగలవారు బహిష్కరించాలి. భారీఎత్తున ప్రజాహిత కార్యక్రమాలను చేబట్టిన, సేవాదృక్పథం గల సంస్థను అప్రదిష్టపాలు చేయటానికి పూనుకోవటం అంటే బీద, పేద ప్రజలకు తీరని హానిచేయటమే అవుతుంది. (తరువాయి 41 వ పేజీలో)

శ్లో॥ కస్యాస్తి నాశే మనసో హి మోక్షః ?
క్వ సర్వథా నాస్తి భయం ? విముక్తౌ
శల్యం పరం కిం ? నిజమూర్ఖతైవ
కే కే హ్యుపాస్యాః ? గురుదేవవృద్ధాః ॥

మోక్షం నాలుగు పురుషార్థాల్లో చివరిదీ, ప్రధానమైనదన్నీ, ధర్మార్థకామాలను త్రివర్గం అంటారు. ఈ త్రివర్గంలో ధర్మం ముఖ్యం ధర్మంతో కూడి వున్నప్పుడే అర్థకామాలకు విలువ అప్పుడే మోక్షమనే పురుషార్థం సాధించే అవకాశం ఏర్పడుతుంది.

# అమృతవాణి

## కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

అయితే ఆ మోక్షాన్ని పొందటం అంత తేలికైన పనికాదు. మనస్సనేది నశించినప్పుడు అది సాధ్యం. మనస్సు నశించటమేమిటి ? అని ఆశ్చర్యపడనక్కర్లేదు.

మనిషి ప్రతిబంధకం ఈ మనస్సే అనంతంగా కోరికలు, ఆశలు పుట్టే చోటు ఈ మనస్సు ఈ మనస్సు కామ క్రోధాలకు నిలయం అందువల్ల కలుషితమౌతుంది. మనస్సు నశించటమంటే కోరికలు మొదలయినవన్నీ నశించిపోవటమన్నమాట.

మనస్సు మిగిలిన పది యింద్రియాలకు రాజు వాటి ద్వారా విషయాసక్తమై వుంటుంది మనసు అలాంటి మనసులో ఎలాంటి విషయవాసనలు లేకుండా చేసుకొని నిర్మలంగా వుంచుకోవటమే మనస్సు నశించటమంటే అంటే పరిశుద్ధమైన మనస్సు కలిగివుండటమన్నమాట

మనశ్శుద్ధి కలిగినప్పుడు మోక్షసాధన తేలికవుతుందని సారాంశము

ఈ జనన మరణాత్మకమైన సంసారమునుండి విముక్తినే మోక్షమంటారు. ఎప్పుడైనాసరే ఎలాంటి దాని వల్లను ఎక్కడైనా ఎలాంటి భయం కలగకుండా వుండాలంటే విముక్తి కావాలి విముక్తి సంభవించిన వారికి భయమనేదే వుండదు సర్వదా అభయమే.

మనిషికి అనేక సమస్యలేర్పడి మనశ్శల్యంగా పని చేస్తాయి గుండెలో ముల్లు గుచ్చుకొన్నట్లు ఏదో ఒక బాధ మనసును కలవేస్తూంటుంది. అలాంటి శల్యాలు ఏర్పడటానికి కారణం ఒకటే ఒకటి అది మూర్ఖత ఏ బాధనైనా మనస్సుకు వెత కలిగిస్తూంటే దానికి మందో మాకోవేసి తీసివేసేసుకోవచ్చు కాని మనస్సుకు పడిన ఆదివి తీసివేసుకోవాలంటే మనిషిలోని మూర్ఖత్వం పోవాలి మూర్ఖత్వం అజ్ఞానం వల్ల ఏర్పడుతుంది అజ్ఞానం తొలిగితే యేదీ మనసును గాయపరచలేదు. కనుక తన మూర్ఖతయే తనకు శల్యమని గమనించాలి మూర్ఖత్వం కంటే మించిన శల్యం లేదని భావం.

అలాగే అసలు మనం సేవించవలసింది యెవరిని అని ఆలోచన వస్తుందప్పుడప్పుడు.

నిజంగా మనం సేవించదగినవారు గురువు, దైవం, వృద్ధులు. అనే విషయం గుర్తించుకోవాలి ఇంతకంటే మనిషిని సేవించతగినవారు మరొకరు లేరు.

ఇంతవరకు పైన చెప్పుకొన్న భయంగాని, మూర్ఖత్వంగాని ఈ ముగ్గురిని సేవించటంవల్లనే తొలిగిపోతాయి గురూపదేశంవల్ల జ్ఞానం కలుగుతుంది. దానివల మోక్షం లభిసుంది.

శ్రీవాణి

గురుపూర్ణిమ సందేశం

# అన్ని అనర్థాలకు అసూయే మూలకారణం

భగవాన్ సాయి దివ్య సందేశం

" కుటిలాలక సంయుక్తం
పూర్ణచంద్ర నిభాననం
విలసత్కుండల ధరం
సత్యం బ్రహ్మ జగద్గురుం

ప్రేమస్వరూపులారా !

సత్యమే ప్రాణము, సత్యమే తేజము, సత్యమే సర్వత్రా వ్యాపించి నటువంటి బ్రహ్మము అట్టి బ్రహ్మతత్వమును గుర్తించుటయే మానవత్వమునకు ప్రధాన లక్ష్యము. మానవత్వము ఎంతటి పవిత్రమైనదో విచారించినపుడే ఈ దివ్యత్వము మనకు అర్థమవుతుంది.

మానవుడు శరీర ఇంద్రియ మనోబుద్ధులతో కూడి నటువంటి స్వరూపమని భావించడము ఇది అజ్ఞానము శరీర ఇంద్రియ మనోబుద్ధులు మానవత్వమునకు ఉపాధులే కాని మరొకటి కాదు ఇలాంటి శరీర ఇంద్రియ మనోబుద్ధులు ఆధారం చేసుకొని ఇవియే మానవత్వము నకు ఆధారములని, ఇవియే మానవత్వము యొక్క స్వరూపములని భావించటము సరికాదు. సువ్యక్తము కాని కోరికలు, మనోబుద్ధులు మీరు కారు ముక్తికి బంధకారమగు మోహపు భ్రాంతియూ మీరు కాదు రక్తపు మాంస శల్యముల రాశియు మీరు కాదు మీ శక్తివి విన్నెరుంగల శాశ్వతమౌ పరబ్రహ్మమే మీరు. కనుక ఈ ఆధారమైనటువంటి ఉపాధులను మనం ఆశ్రయించి, ఆధేయమైనటువంటి తత్త్వమును అనుభవించే నిమిత్తమై శాశ్వతమైన, సత్యమైన నిత్యమైన స్వరూపాన్ని విస్మరిస్తున్నాము. గృహములో నివాసం చేసినంతమాత్రాన గృహము మనము కాదు. మనకంటే గృహము వేరు. కారులో ప్రయాణం చేసినంత మాత్రమున కారు మనము కాదు. కారుకంటే భిన్నమైన వారం మనము. అటులే "దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవస్సనాతనః" ఈ దేహమనే భవనమునందు నివసించినంతమాత్రమున దేహము మనము కాదు. కనుక నీ స్వస్వరూపాన్ని నీవు గుర్తించే నిమిత్తమై దేహేంద్రియ మనోబుద్ధులు ఆధారం చేసుకొని ఆశ్రయించి నీయొక్క దివ్యత్వాన్ని గుర్తించటం అత్యవసరం.

---

" అన్ని అనర్థములకు అసూయే మూలకారణం. ఈ 'అసూయ' అనే రోగమునకు మందు లేదు. భయంకరమైన 'కాన్సర్' నివారణకు కూడా ఒక ఔషధం ఉన్నది. ఈ నాడు 'అసూయ' అనే రోగము సర్వాంగములయందు ప్రవేశించినది. ద్వేషము, క్రోధము, లోభము ఈ 'అసూయ'కు పుట్టిన పిల్లలు అయితే, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు 'అనసూయ' పుట్టినారు. అదియే సహనము ప్రేమ, సానుభూతి. అనసూయకు అసుర సంపత్తి. అనసూయకు దైవసంపత్తి. అసూయకు అనసూయకు ఇదియే వ్యత్యాసము, ఈ అసూయకు కారణమే లేదు. దీనికి No season, No reason.

— బాబా

అలనాడు సుజ్ఞానమనే మండోదరి రావణుని ఎంతగానో బోధించినది. తర్వాత ఈ విజ్ఞానమనే విభీషణుడు కూడనూ రావణునకు ఎంతగానో బోధించాడు. సోదరా! నీవు చక్రవర్తివి. చక్రవర్తి చేయవల్సినటువంటి పని కాదు ఇది. నీవు మహా తపస్వివి. ఈ తపస్వివి అయినటువంటి నీవు ఈ విధంగా పెడమార్గాలు పట్టడం మంచిదికాదు. నీ యొక్క విజ్ఞాన శక్తిని నీవు చక్కగా విచారణ చేసుకొని పవిత్రమైన మార్గంలో ప్రవేశించమని విభీషణుడు ఎంతగానో బోధించాడు. కాని స్వార్థపరుడైన రావణుని తలకెక్కలేదు. తదుపరి మార్పు లేకపోవటం చేతనే, ప్రజ్ఞానమనే హనుమంతుడు కూడనూ ఎన్నియో విధముల బోధించాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

స్వార్థపరునకు తనయొక్క ప్రాణము తన హస్తములో లేదు. పవిత్రమైన హృదయము కలిగి, పరోపకారములైన భావములుకల్గి నిస్వార్థమైన హృదయంతో లోకకళ్యాణము ఆశించినటువంటి రాముడికి మాత్రమే తన ప్రాణములు తన హస్తములో ఉంటున్నవి. స్వార్థపరుని యొక్క ప్రాణము పరొకరి చేతుల్లో ఉంటుంది. కనుకనే ఈ సత్యమును గుర్తించినటువంటి వ్యక్తులయందు దివ్యత్వమనేది సాక్షాత్కరిస్తుంది. ఈ మానవత్వము కేవలము స్వస్వరూపమైనటువంటి దైవత్వమే కానీ, మరొకటి కాదు. భగవంతుడు ఎక్కడో ఏ ప్రదేశమునందో ఉంటున్నాడని భావించడం అజ్ఞానము. తానే భగవంతుడు తనకు తానై అయినటువంటి భగవంతుడిని మరొకచోట వెతుకుట ఎట్లా సాధ్యమవుతుంది ? కనుక పరబ్రహ్మ మనగా తానే పరబ్రహ్మము.

శరీర ఇంద్రియ మనోబుద్ధులను త్యజించునపుడు మిగులునవి అవియే శరీరమనేది కేవలము ఒక ఉపాధి. మనము ధరించునటువంటి వస్త్రము వంటిది ఐతే ఈ వస్త్రము పెరుగుతుంటుందా ? దేహము పెరుగుతున్నది కదా! అవును పెరుగుతున్నది. నిత్యమూ మనం ఊడ్చి ఇంత చెత్తను ఒక దిబ్బలో వేస్తుంటే దిబ్బ కూడనూ పెరుగుతున్నది. దిబ్బ పెరిగినంత మాత్రమున దానికి ప్రాణమున్నదని అర్థమా ? కాదు ... కాదు. అదే నిజమయినటువంటి ఆత్మ జ్ఞానము. ఇట్టి పవిత్రమయిన జ్ఞానమును మనం చక్కగా అర్థం చేసుకోవాలి. మానవత్వంలో ఉండినటువంటి ఇంత దివ్యత్వాన్ని మనం విస్మరించి ఎక్కడో ఏమో జరుగుతున్నటువంటి అజ్ఞానమును మనం విశ్వసించి, దానిచేతే బద్ధులమై అనేక విచారములకు గురిఅవుతున్నాము ఇట్టి విచారము తెచ్చుకొన్నవే గానీ సహజమయినవి కావు కనుక ప్రతి మానవత్వం కూడనూ పుట్టిన తర్వాత గిట్టక తప్పదు. పుట్టుటే ప్రధానమయిన లక్ష్యము అటి ఉత్తమమయిన భావములు కల్గినప్పుడే అది జన్మ రాహిత్యము అన్నారు. కనుక మానవత్వం లోపల ఇటువంటి దివ్యభావాన్ని మనం గుర్తించి, పరతత్త్వాన్ని విశ్వసించి దైవత్వాన్ని పొందాలి. అదియే ప్రధానమయినటువంటి సాధకుని యొక్క మార్గం.

ఈనాడు మానవత్వంలో అనేక వికారములు ప్రారంభమవుతున్నాయి. ఈయొక్క జగత్తులో జరిగేటువంటి సమస్త అనర్థములకూ మూలకారణమైన ఒక హస్తము ఉంటున్నది. ఏ అనర్థములు జరిగినప్పటికినీ దీనికేదియో పరదేశీయుల హస్తమున్నదని లేక మరియొక హస్తమున్నదనీ, ఇంకొక మతము వారి హస్తమున్నదని ఏమేమో ఎవరికి తోచినట్లు వారు చెబుతూ ఉంటారు. ఇది కేవలం అర్థం కానటువంటి భావములే ఇవి కేవలమూ ఊహాగానములే కేవలమూ ఒకవిధమైన అసత్య వాదములే హస్తమున్నది నిజమే. ఏమిటా హస్తము ? అసూయ అనేటటువంటి హస్తము. ఈ ప్రపంచములో సర్వత్రా సర్వ రంగములయందు కూడనూ ప్రవేశించినటువంటి యీ జటిలమైనటువంటి రోగము. ఈ అసూయ అనే రోగమునకు మందుయే లేదు. భయంకరమైన క్యాన్సర్ వ్యాధి నివారణకు కూడను ఒక ఔషధము ఉంటున్నాది. కాని అసూయ అనే రోగము ఏమాత్రమూ నివారించుటకు వీలులేదు. ఒకేసారి తీసుకొనిపోవడమే, నివారణే లేదు. కనుక

ఈనాడు అసూయ అనే రోగము సర్వ రంగముల యందూ ప్రవేశించినది. దీనివల్ల ఈ విధమైనటువంటి అవాంతరములు జరుగుతునే ఉంటున్నాయి. ఈ అసూయకు ముగ్గురు బిడ్డలు పుట్టారు. అవియే ద్వేషము, క్రోధము, లోభము. ద్వేషము, క్రోధము, లోభము అసూయకు పుట్టినటువంటి పిల్లలు అనసూయకు పుట్టినటువంటి పిల్లలు ముగ్గురున్నారు. వారే బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు. అవియే సహనము, ప్రేమ, సానుభూతి. అనసూయకు, అసూయకు ఉండినటువంటి వ్యత్యాసము ఇదియే ఒకటి అసుర సంపత్తి మరొకటి దైవ సంపత్తి. ఈ అసూయకు పుట్టినటువంటి అసుర సంపత్తి విచారణశక్తి లేకుండా, విచక్షణా జ్ఞానం లేకుండా, యుక్తాయుక్త పరిశీలన లేకుండా అనేక విధములైన మూర్ఖ మార్గములో ప్రవేశిస్తున్నది. దీనికి మూలకారణము ఏమిటి? ఆకలికి ఏది కారణము? అరగటమే ఆకలికి కారణం, జీర్ణించటమే ఆకలికి కారణము. అదే విధముగనే ఉత్తమ భావములు నశించడమే ఈ అసూయకు మూలకారణము. ఎవరైనా కూడనూ ఉత్తములను చూచినప్పుడు వారిమీద అసూయ వస్తుంది. ఎవరైనా అభివృద్ధి చెందుతున్నారంటే వారి మీద అసూయ కలుగుతుంది. ఎవరైనా కొంచెం అందంగా ఉన్నారంటే వారిమీద అసూయ కల్గుతుంది. ఎవరో ఒకరు పేరు ప్రతిష్ఠలు తెచ్చుకుంటున్నారంటే వారిమీద అసూయ వస్తుంది. ఎవరో ఒకరు ఉన్నత స్థాయిలోనికి వచ్చారంటే వారిమీద అసూయ కల్గుతుంది. ఈ అసూయకు కారణమే లేదు. దీనికి No Reason, No Season. ఇలాంటి అసూయ రోగముతో ఉండినటువంటి వారికి అనేక విధములైన పాడు బుద్ధులు పుడుతుంటాయి. ఈనాటి ప్రపంచంలో, యిప్పుడు జరుగుతున్న పరిస్థితులలో సాయి యొక్క పేరు ప్రతిష్ఠలు యావత్ ప్రపంచమునకే వ్యాప్తి చెందుతూ వచ్చాయి. దీనిని అరికట్టడానికిగాని, దీనిని తగ్గించడానికిగాని, పడగొట్టటానికిగాని ప్రయత్నము చేయాలనే తలంపుతో అసూయా బుద్ధులతో వారు ఇలాంటి ప్రచారములు జరుపుతూ వుంటారు ఈ ప్రచార ప్రబోధనల వల్ల నా కీర్తి తరిగేది, ఒరిగేది, పెరిగేది కాదు. నా పవిత్రతే నా కీర్తికి మూలకారణం. యీ ప్రచార ప్రబోధనలు కాదు నా కాలి మొననుండి తల వరకూ కూడను నాలో ఉండినటువంటిది నిస్వార్థమే పవిత్రమైనటువంటి ప్రేమ నే. ఇలాంటి పవిత్రాన్ని ఎవ్వరునూ ఏమాత్రం కదిలించడానికి వీలుకాదు. నాకు ఎవరూ ద్వేషులు లేరు నేను ఎవరికీ అపకారం చేయలేదు ? కనుక నాకు ఏ విధంగా అపకారం చేయగలరు? చేయడానికి వీలేకాదు. ఇవేవో అసూయతో కూడినటువంటి చర్యలుగా జరిగిపోతున్నాయి. అంతమాత్రము చేత భక్తులు ఏ విధమైనటువంటి బాధలకు గురి కాకూడదు నిజముగా నిత్యమైన సత్యమైనటువంటి వారిని ఇవి ఏమాత్రం కదిలించలేవు. సింక్లర్, గోల్డ్‌స్మిన్ హాక్సన్ చెప్పారు. దీనికున్న మూలకారణం ఏమిటి? వారి విశ్వాసమే మూలకారణం. ఎన్ని వేల మైళ్ళ దూరంలో ఉండినప్పటికినీ వారికి ఈ విశ్వాసమే ఆ విధమైన ఫలితాలను అందిస్తూవస్తున్నాయి అసూయాపరులకు అన్నీ అసత్యాలే వస్తుంటాయి. సత్యమనేటటువంటిది వారి దగ్గర ఏమాత్రమూ మచ్చుకైనా కన్పించదు. కనుక ఏ విధమయిన అసత్య ప్రచారములు జరిపినప్పటికినీ ఈ సత్యాన్ని ఏమాత్రం కదిలించలేదు. కనుకనే మనం సత్యమును పాటించాలి. పవిత్రతను మనం అనుసరించాలి. నిస్వార్థమైన జీవితములో మనం ప్రవేశించాలి. ఏవిధంగా నమ్మినా నమ్మకపోయినా నాలో స్వార్థమనేది లేదు. నా పవిత్రత లోపల వేలెట్టి చూపే అధికారమే వారికి లేదు. అంత దివ్యమైనటువంటి పవిత్రతను ఎవరు చూపగలరు? వివేకుడే వివేకాన్ని గుర్తించడానికి వీలవుతుంది. అవివేకులు వివేకాన్ని ఏ విధంగా గుర్తించగలడు? సాధ్యము కాదు. కారణమేమనగా నాయొక్క మంచితనమే దీనికి మూలకారణము. దీన్ని నేను చెప్పు

కోవడం కాదు. సమయం వచ్చింది కనుక నే సత్యాన్ని బోధించవలసి వచ్చింది సాయి చేసే సర్వ పనులలో కూడనూ నిస్వార్థమే, లోకకళ్యాణమే మీకుతెల్సినూ. ఈ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ కట్టాము. ఇందు లోపల ఎంతోమంది తల్లులకు ప్రాణమిచ్చాం. ఎంతో మంది తండ్రులకు ప్రాణమిచ్చాము ఎంతోమందికి పుత్రభిక్ష పెట్టాము ఇది ఎవరు చేయగలరు ?

ఒక కుగ్రామమయిన పుట్టపర్తి ప్రపంచ మ్యాప్ లోపల ప్రవేశించింది. ఇదే పెద్ద అసూయ. సత్య సాయి చేసేటటువంటి చిన్న కార్యములు మొదలు పెద్ద కార్యములు కూడనూ ఏ విధంగా ఎవరూ కూడనూ విమర్శించడానికే వీలే కాదు. మానవమాత్రులు చేయ లేరు. ఇలాంటి సత్యాన్ని ప్రపంచంలో జరుగుతున్నటు వంటి సత్యాన్ని వచ్చి చూసి, ఆనందించి, ఆచరించి, ఆనందంగా అనుభవించడానికి నోచుకోలేని వ్యక్తులు మాత్రమే ఎయిర్ కండీషన్ రూములలో కూర్చొని అనేక విధములయినటువంటి విమర్శలు చేస్తూవుంటారు ప్రపంచానికి బోధలు చేస్తుంటారు వీరా ప్రపంచానికి ప్రబోధించేవారు ? మలినమయిన హృదయములను నింపుకొని, ఈ జగత్ కళ్యాణమునకై పాటుపడుతున్నా మని చెప్పుకోవడం సిగ్గుచేటు సమాజంలో ప్రవేశించు సత్కార్యములు చేయి. నిస్వార్థమయినటువంటి మార్గ ములో ప్రవేశించు, అప్పుడే ఈ సత్యాన్ని నీవు గుర్తించటానికి వీలవుతుంది. అంతేకాని కేవలమూ అసూయతో నింపుకున్నటువంటి మాటలు అసూయతో నింపుకున్నటువంటి ప్రచార ప్రబోధనలూ ఏమాత్రము కూడనూ పనికిరానటువంటివి "మాటకు ప్రాణము సత్యము" మనం ఏదైనా మంచిమాట చెబితే దానికి సత్యమైనదిగా ఉండినప్పుడే ఆ మాటకు ప్రాణము సత్యములేని మాట ప్రాణములేని మాటే. కనుక నే అన్నీ అసత్య ప్రచారములే ఇవన్నీ కూడను Cheap advertisements ఇలాంటి దీని లోపల మీరు ఏమాత్రము చలించరాదు. మన సత్యాన్ని మన పవిత్రతను మనం నిలుపుకోడానికి ప్రయత్నించాలి. ఇంకా కొన్ని విషయాలు బహిరంగపరచాలి, కనుక నే, మీరు అన్నివిధములైన దిన పత్రికలు చదువుతూ ఉంటారు. దానికోసమే నేను చెప్పవల్సివచ్చింది. మా సత్యసాయి సెంట్రల్ ట్రస్టు అనేది అగ్నితో కూడనూ కాలదు అంత పవిత్రమైన ట్రస్టు ఇది. ప్రతి నయాపైసా కూడనూ ఎంత పవిత్రమైన దీనితో ఉపయోగపెడుతున్నామో మాకు తెలుసుకాని జగత్తుకు తెలియదు. సెంట్రల్ ట్రస్టు వారంతా కూడనూ గత ఇరువది సంవత్సరముల నుండి నిస్వార్థమైనటువంటి సేవ చేస్తున్నారు. ఢిల్లీకో, మద్రాసుకో బొంబాయికో పనిపడినట్లైతే, స్వంత ఖర్చులతో అక్కడికి వెళ్ళి, హోటల్స్ దిగి, వారి సొంత ఖర్చులతో జీవించి వారు తిరిగి వస్తున్నారు కానీ, సత్యసాయి సెంట్రల్ ట్రస్టు యొక్క నయాపైసా కూడనూ వారు ముట్టేవారు కాదు మిగిలిన ఇతర ట్రస్టుల వారంతా మీటింగులకు పిలిస్తే రైలు చార్జీనో, బస్సుచార్జీలనో బిల్లిచ్చుకుంటారు. సత్యసాయి సెంట్రల్ ట్రస్టు వారు మాత్రం బిల్లులు చెల్లించరు ఇంత పవిత్రంగా భావిస్తున్న వారు ఏదో పదవులకోసం పాటుపడుతున్నారని ప్రచారంచేస్తున్నారు. వారికి ఎట్టి పదవులు కూడనూ అక్కరలేదు పదవుల కోసం ఆశించి వచ్చినటువంటివాడు కాదు స్వామి యొక్క ప్రేమను ఆశించి వచ్చినటువంటివారు ఇరువది సంవత్సరముల నుండి బ్యాంక్ నుండి Cash రూపంలో ఒక్క నయాపైసా కూడా Draw చేయలేదు ప్రతి ఒక్కటి కూడనూ చెక్కు ద్వారానే మా యొక్క insitute teachers అంతా ఉంటున్నారు ఈ టీచర్సుకు కూడా మేము చెక్కులు ఇవ్వటం లేదు. Bank లోపలే arrangement చేసి, ఆ టీచర్సుకు వారి యొక్క Account లో వారి జీతాలను జమచేస్తుంటాం. ఇంత Strict మేము ఉంటున్నాము. ఈ పవిత్రమైనటు వంటి దీనిని పవిత్రంగా వినియోగం చేయడం చేత నే మేము దేనిని ఆశించనక్కర్లేదు, ఆశించటం లేదు.

( తరువాయి 29 వ పేజీలో )

# "యువకిశోరం" ఖుదీరాంబోసు

కె. పి. నాయుడు

" దేశమును ప్రేమించుమన్నా ; మంచి అన్నది పెంచుమన్నా
ఒట్టి మాటలు కట్టిపెట్టోయ్ ; గట్టిమేల్ తలపెట్టవోయి ! " - గురజాడ

ప్రజాచైతన్యమే ఉద్యమాలకు ఊపిరి. ఆధునిక భారతదేశ చరిత్రలో స్వాతంత్ర్య ఉద్యమము ఒక మహోజ్వలమైన ఘట్టము. ప్రపంచ ప్రజానీకానికి ఒక వినూత్నమైన సందేశము అందించిన ఉద్యమము అది. భారత జాతి యావత్తు చైతన్యవంతమై సుదీర్ఘ కాలం నిర్వహించబడిన శాంతియుతమైన ఉద్యమము అది. బ్రిటీష్ సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకముగా 1885 సం॥లో రాణి ఝాన్సీ లక్ష్మిబాయి, తాంతియాతోపే, నానాసాహెబ్, బేగం హజరత్ మహల్ మున్నగువారు నిర్వహించిన సాయుధపోరాటమును బ్రిటీష్ ప్రభుత్వము అతి కఠినముగా అణచివేసినది. ఆ తర్వాత "అది అంతము కాదు ఆరంభమే" అని భారత ప్రజలకు కనువిప్పు కల్గింది.

1885 సం॥లో భారతజాతీయ కాంగ్రెస్ స్థాపనతో స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో నూత్న శకము ప్రారంభమైనది. సుదీర్ఘకాలం జరిగిన యీ జాతీయోద్యమము సజీవమైన గంగాప్రవాహము వంటిది. సువిశాలమైన భారతావనిలో భిన్న ప్రాంతాలలో, భిన్నకాలంలో భిన్న ఉద్యమాలు ప్రారంభించబడి చివరకు జాతీయ జీవన స్రవంతిలో విలీనము గావించబడినవి. భారత జాతీయోద్యమములో ఎన్నో ఉద్యమాలు ప్రారంభించబడి ప్రజలలో కొంత చైతన్యం తీసుకొని చివరకు జాతీయ ఉద్యమంలో సంలీనము కావించబడింది

భారతమాత దాస్య శృంఖలాలను ఛేదించుటకు, హలం పట్టిన కర్షకులు, కలం పట్టిన విద్యార్థులు, ప్రగతి చక్రాలను త్రిప్పిన కార్మికులు, పామరులు, పండితులు, స్త్రీలు, పురుషులు, భిన్నరంగాలకు, వృత్తులకు, వర్గాలకు చెందిన అసంఖ్యాకమైన ప్రజానీకం పాల్గొన్న అసాధారణ ఉద్యమము అది.

జాతీయ ఉద్యమ తొలి దశలో బ్రిటీష్ ప్రభుత్వము అత్యంత ఉదాసీన వైఖరితో ప్రవేశ పెట్టిన ఉదార పరిపాలనా సంస్కరణలు 1861 మరియు 1892 లో ప్రవేశపెట్టబడిన కౌన్సిల్ చట్టములు కనీసం మితవాద కాంగ్రెసు నాయకులకు కూడా సంతృప్తిని కల్గించలేదు. లార్డ్ కర్జన్ అనుసరించిన మిక్కిలి నిరంకుశ, ప్రజాకంటక పరిపాలనా పద్ధతులు, జాతి విభజనకు వారు చేయు ప్రయత్నములు, ప్రజా ఉద్యమాలను అణచివేయుటకు బ్రిటీష్ ప్రభుత్వము అనుసరించు దమన చర్యలు, బెంగాల్ విభజన భారత ప్రజలలో తీవ్రమైన అసంతృప్తిని, ఆవేదనను కల్గించినవి. హిందూ ముస్లింలను విభజించుటకు 1909 భారత ప్రభుత్వ చట్టము ద్వారా ఏర్పాటు చేసిన ప్రత్యేక మత వియోజక వర్గాలు జాతీయోద్యమమునకు గొడ్డలిపెట్టుగా భావించబడినది. ఇట్టి పరిస్థితులలో మితవాద, అతివాద కాంగ్రెస్ నాయకులు అనుసరించిన విధానాలు, పద్ధతులు వలన మనకు స్వాతంత్ర్యము సిద్ధించదు అని దమన చర్యలకు పాల్పడిన బ్రిటీష్ ప్రభుత్వాన్ని, ప్రభుత్వ ఉద్యోగస్తులు, అధికారులలో భయోత్పాతాన్ని సృష్టించి, విధ్వంసక చర్యలకి పాల్పడి బ్రిటీష్‌వారిని దేశం నుండి తరిమివేయాలి అన్న దృఢసంకల్పంతో, దేశభక్తి, త్యాగనిరతి, ఆత్మార్పణ భావముగల కొంతమంది యువకులు, విద్యాధికులు, బెంగాల్, పంజాబ్, మహా

రాష్ట్ర, మద్రాసు రాష్ట్రములలో అనువైనచోట్ల రహస్య సంఘాలు ఏర్పాటుచేసి, భయంకర ఉద్యమాన్ని కొన సాగించిరి. దీనినే " Terrorist Movement " అని అంటారు.

## భయంకర వాదులు – లక్ష్యాలు

దేశభక్తి, తీవ్ర జాతీయ భావముగల కొంతమంది పౌరులు కొన్ని రహస్య సంఘాలుగా ఏర్పడి బ్రిటీష్ ప్రభుత్వాన్ని కూల్చడానికి ప్రభుత్వ ఉద్యోగుల హృదయాలలో భయోత్పాతాన్ని సృష్టించడానికి అనేక కుట్రలు, పన్నాగములు, పథకములు రూపొందించి అనేక త్యాగాలకు సంసిద్ధులైనవారు భయంకరవాదులు. వీరు దేశ ద్రోహులుకారు, స్వార్థపరులుకారు, నిజమైన అకళంకమైన దేశభక్తులు. అనేక ఐరోపా దేశాలలో జరుగుచున్న రహస్యరాజకీయసంఘాల కార్యకలాపాలు, రష్యాలో శూన్యవాదులు అనుసరించిన విధ్వంసక విధానాలు భారత దేశంలో యీ భయంకర ఉద్యమానికి ప్రేరణ, ఉద్దీపన కల్గించినవి. వీరు తమ లక్ష్యసాధనకు అక్రమ విధానాలద్వారా దోపిడీల ద్వారా ధనాన్ని సంపాదించడం, ఆ డబ్బుతో బాంబులు, ఆయుధాలు, తుపాకులు మందుపాతరలు తయారుచేయడం, విదేశాల నుండి రహస్యముగా మారణాయుధాలు కొనుగోలుచేయడం, రహస్య ప్రచార కార్యక్రమాల ద్వారా ప్రజలను ఉత్తేజపర్చడం, రహస్య కార్యకలాపాలు నిర్వహించే సంస్థలతో సంబంధాలు ఏర్పరచుకొనడం, సమయము సందర్భము చూచుకొని బ్రిటీష్ వారిపై దాడిచేయడం భయంకరవాదుల ముఖ్య ఆశయము. పట్టుదల, స్వాతంత్ర్యదీక్ష తత్పరత ఉండే 30 కోట్లమంది భారతీయులుసుమారు మూడున్నరలక్షల జనాభాగల బ్రిటీష్ ప్రభుత్వ అధికారులను, ఉద్యోగస్తులను ఈ దేశము నుండి తరిమేయడం పెద్ద కష్టసాధ్యము అయిన పనికాదు అని వీరి అభిప్రాయము. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో "దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ" చేయమని ఉపదేశించినాడు. కావున దుష్టులు, దోపిడీదారులు అయిన బ్రిటీష్ వారిని విధ్వంసమొనర్చి ధర్మ సంరక్షణకొరకు మాతృదేశ విముక్తి కొరకు ఉద్యమించడం మన అందరి కర్తవ్యం అని వారు ప్రచారం చేసెడివారు –

## ఆకర్షణ

తమ సర్వస్వాన్ని త్యాగం చేసి చివరకు తమ ప్రాణములను కూడా లెక్కచేయక మాతృదేశ బంధ విముక్తికై కృషిచేయుచున్న విప్లవకారులను ఖుదీరాం బోసు తనకు మార్గదర్శకులుగా ఎంచుకొన్నాడు. భారతీయులపై అత్యంత అమానుషముగా దమన చర్యలకు పాల్పడుచున్న బ్రిటీష్‌వారి విధానములను గర్హించి ఆంగ్లేయులపై మొట్టమొదట బాంబు విసిరిన వీర కిశోరము ఖుదీరాంబోసు. దేశభక్తి, దైవభక్తి, సామాజిక స్పృహ, త్యాగశీలత ధైర్య సాహసములు గల ఖుదీరాంబోసు తన 19 ఏట చిరునవ్వుతో భగవద్గీతను చేతితో పుచ్చుకొని ఉరికంబము ఎక్కిన యీ యువకుని జీవితం, ఆశయాలు, త్యాగశీలత సంస్మరించుట నేడు అత్యంత ఆవశ్యకము. నేడు గతి తప్పిన యువకులు, బాధ్యతారహితమైన విద్యార్థులకు అనాచార, అక్రమ, అన్యాయ వినాశన విధ్వంసక చర్యలకు పాల్పడుచున్న విద్రోహులకు, దేశ ఐక్యతకు, అభివృద్ధికి అవరోధకులైన స్వార్థపర శక్తులకు ఖుదీరాం జీవితం కనువిప్పు కల్గించగలదని ఆశించగలము.

## పవిత్ర గీతము

ఖుదీరాంని మిక్కిలి పిన్నవయస్సులోనే ప్రభావితం చేసిన గీతం " వందేమాతర గీతం ", బంకించంద్ర చటర్జీ (బకించంద్ర చటర్జీ) రచించిన "ఆనందమఠ" గ్రంథం ఖుదీరాంను ఉత్తేజపర్చి, తన జీవితధ్యేయాన్ని నిర్దేశించినది బకించంద్రుని హృదయావేదననుండి ఆవిర్భవించిన మాతృదేశాభివందనం. అది సుందరము, శుభప్రదము, సస్యశ్యామలము, మనోహరము అయిన భారతమాత వైభవాన్ని, ఐశ్వర్యాన్ని, అధిక్యతను అత్యంత మనోహరముగా వర్ణించిన గీతము అది 1857 లో జరిగిన ప్రథమ భారత

స్వాతంత్ర్య సమరంలో ఎంతో శక్తిసామర్ధ్యాలతో పోరాడినప్పటికి ఆ యుద్ధంలో భారతీయులకు ఓటమి తప్పలేదు. అప్పటికి 17 సం॥ ప్రాయములోగల బంకించంద్రుడు "ఈ ఓటమికి క్రమశిక్షణారాహిత్యం, అనైక్యత, కొందరు దేశద్రోహులు, స్వార్థపరులు, అవకాశవాదులు బ్రిటీష్ వారికి సహకరించడమే" కారణమని గుర్తించినాడు ఈ స్వార్థాన్ని విడనాడి, ప్రజలను ఉత్తేజపర్చగల ఒక పవిత్ర ఆదర్శము ఉండాలి అని బంకించంద్రుడు తీవ్రముగా ఆలోచించినాడు. ఈ ఆవేదన, ఆలోచన ఫలితమే వందేమాతర గీతం ఆవిర్భావము. ఆతడు ఆశించిన విధముగానే అనతికాలంలోనే 'వందేమాతరం' దేశభక్తుల పాలిట తారకమంత్రం అయింది.

అరవిందఘోష్, బ్రహ్మ బాంధవ ఉపాధ్యాయ, బిపిన్ చంద్రపాల్, బీరేంద్రకుమార్ ఘోష్, భూపేంద్రనాద్ దత్తు మొదలగువారు స్వాతంత్ర్య పోరాటానికి నడుం బిగించారు. బెంగాల్ విప్లవాలకు, ఉద్యమాలకు ప్రధాన కేంద్రముగా మార్చబడింది వీరి ప్రేరణచే వేలాదిమంది యువకులు ఈ జాతీయ ఉద్యమంలో ప్రవేశించిరి. యువకులకు తుపాకీ, లాఠీ, తదితర ఆయుధాలను ఉపయోగించడంలో శిక్షణ యిచ్చుటకు, అనుశీలన సమితి, యుగంధర్, భారతసమితి వందేమాతరం, సంప్రదాయ విరోధి సమితి మొదలగు విప్లవ సంస్థలు అనేకం స్థాపించబడినవి. "ప్రాణత్యాగం చేయండి, దానికిముందు ప్రాణాలు తీయండి, స్వాతంత్ర్య దేవాలయంలో మీ ప్రాణాలు అర్పించి రక్తదానం చేయుటయే మీ దేవతారాధన సార్ధకం కాదు" అని అనుశీలనా సమితి సభ్యులు ప్రచారం చేసేవారు

1905 లో లార్డ్ కర్జన్ బెంగాల్ విభజనకు శ్రీకారం చుట్టాడు దీని వెనుక ఉన్న దురుద్దేశాన్ని భారతీయులు గుర్తించారు. దేశం నలుమూలలా బెంగాల్ విభజనను ముక్తకంఠముతో నిరసించిరి అతివాదత్రయం లాల్, బాల్, పాల్ యీ ఉద్యమానికి ఆజ్యం పోసారు.

తల్లి పాలతోబాటు దేశభక్తినికూడా రంగరించి త్రాగిన ఖుదీరాంబోస్ ఈ ఉద్యమంలోకి దూకాడు. మాతృదేశ సేవకే తన జీవితాన్ని అర్పించాలి అని నిశ్చయించుకొన్నాడు. త్యాగశీలురైన విప్లవకారులను మార్గదర్శకులుగా ఎంచుకొన్నాడు కొద్ది రోజులలోనే ఖుదీరాం లాఠీ, తుపాకీ, కత్తి మొదలగు ఆయుధాలను ఉపయోగించడంలో ప్రావీణ్యాతను సంపాదించాడు. సన్నగా, నాజూకుగా ఉన్నా చాలా చురుకుగా వ్యవహరించేవాడు. దేశభక్తి, జాతీయతాభావము, రాజకీయ చైతన్యం కొఱవడిన అసంఖ్యాకులైన సామాన్య ప్రజానీకంలో దేశభక్తి, స్వాతంత్ర్యదీక్ష తత్పరత పెంపొందింపచేయుటకు ఈనాడు కృషి సల్పెను. 1906 లో మేధినీపూర్‌లో జరిగిన పెద్ద బహిరంగ సభలో ఖుదీరాం, వందేమాతర గీతం, దాని భావమూ, ఆంగ్లేయులు అనుసరించుచున్న అక్రమాలను వివరించు కరపత్రమును ముద్రించి, స్వయముగా పంచిపెట్టెను. ఖుదీరాంను నిర్బంధించుటకు పోలీసులు చేసిన ప్రయత్నాల నుండి చురుకుగా తప్పించుకొని పారిపోయాడు.

1907 లో వందేమాతరం పత్రికపై బ్రిటీష్ వారు పెట్టిన కేసు విచారణ జరుగుచున్న రోజులలో వేలాది మంది యువకులు కోర్టుఆవరణలో చేరి 'వందేమాతరం' అంటూ నినాదాలు చేసేవారు. 1907 ఆగష్టు 28 తేదీన కోర్టు బయట ప్రశాంతముగా సమావేశమైన ప్రజలపై పోలీసులు లాఠీచార్జి చేసి, ఏ ఒక్కరిని వదలక లాఠీలతో చితకబాదారు. 15 సం॥ ల వయస్సుగల సుశీల్ కుమార్ సేన్ అనే బాలుడు దూరంనుండి పోలీసులు చేయుచున్న ఈ క్రూరత్వాన్ని చూచి సహించలేక వారిని ప్రతిఘటించాడు. పోలీసులు సుశీల్‌కుమార్‌ని కూడా చితకబాది నిర్బంధించి కోర్టుకి పంపించారు. అతి క్రూరుడు అయిన కింగ్స్‌ఫోర్డ్ మేజిస్ట్రేటు 15 లాఠీ దెబ్బలు శిక్షగా విధించాడు. బట్టలు ఊడదీయించి అత్యంత అమానుషముగా సుశీల్‌కుమార్‌ని శిక్షించారు. ప్రతి లాఠీ దెబ్బలకు వందేమాతరం అని బిగ్గరగా

అరవసాగినాడు. అనాడు జరిగిన బహిరంగ సభలో సుశీల్‌కుమార్‌కి ఘన సన్మానం జరిగింది. అతని దేశ భక్తిని, ధైర్యసాహసాలను గూర్చి పలువురు వక్తలు ప్రశంసించిరి

## ప్రతీకార చర్య

మానవరూపంలో ఉన్న రాక్షసుడు అని పేరుపొందిన మేజిస్ట్రేట్ కింగ్స్‌ఫర్డ్‌ను హతమార్చాలి అని విప్లవకారులు నిర్ణయించుకొన్నారు. కింగ్స్‌ఫోర్డ్‌ను ముజఫర్‌పూర్‌కి బదిలీ చేశారు కింగ్స్‌ఫోర్డ్‌పై బాంబు వేసే బాధ్యతను యువకుడు అయిన ఖుదీరాంకి అప్పగించారు అతి కష్టము అయిన యీ పని నీవు చేయగలవా అని విప్లవనాయకుడు అడిగిన ప్రశ్నకు ఖుదీరాం " మీ ఆశీర్వాదం ఉంటే ఏదీ అసాధ్యం కాదు – నాకు తెలుసు యీ పని చేసినందుకు ప్రభుత్వము మహా అయితే నన్ను ఉరితీయవచ్చు. కాని నేను దానిని వరంగా భావిస్తాను. నాకు తల్లి, తండ్రి, గురువు, భారతమాతే. ఆ తల్లి కొరకు నా ప్రాణాలు అర్పించడం అదృష్టంగా భావిస్తాను. నా కోరిక ఒక్కటే మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించేవరకు నేను ఈ గడ్డపై మళ్ళీమళ్ళీ జన్మించి నా జీవితాన్ని త్యాగం చేయాలి అని అనుకుంటు న్నాను " అని స్థిర సంకల్పంతో, దృఢచిత్తంతో సమాధానం తెలియచేశాడు

ఈ కార్యక్రమం అతి జాగరూకతతో నిర్వహించుటకు ఖుదీరాంకి సహాయముగా ప్రఫుల్లకుమార్ చాకీ అనే యువకుని పంపించారు. ఇద్దరూ చెరొక తుపాకీ బాంబు కొంత డబ్బు తీసుకొని విప్లవ నాయకుల ఆశీస్సులతో ముజఫర్‌పూర్ చేరుకొన్నారు 1908 సం॥ ఏప్రియల్ నెల 30 తేదీన వీరు ఇద్దరూ ముజఫర్‌పూర్ యూరోపియన్ క్లబ్బుకి సమీపంలో గల పొదలలో పొంచియుండి కింగ్స్‌ఫోర్డ్ బయటకు వచ్చే సమయం కోసం ఎదురుచూస్తూ ఉన్నారు ఇంతలో ఒక గుర్రపు బగ్గీ బంగ్లానుండి బయటకు రాసాగింది. అది గమనించి ఖుదీరాం మెల్లగా " నేను బాంబు వేయగానే నీవు పారిపోవాలి " అని ప్రఫుల్లకుమార్‌ని హెచ్చరించాడు "నా కొరకు ఆత్రపడకు నేను క్షేమంగా మన నాయకుల పాదాల చెంతకు చేరతాను" అని అన్నాడు ప్రఫుల్ల కుమార్. వందేమాతరం అంటూ ఊపిరి బిగబట్టి గుర్రపు బగ్గీ ఎదురు రాగానే ఖుదీరాం తన చేతిలోని బాంబు గురి చూచి విసిరాడు. ఆంగ్లేయులకు వ్యతిరేకముగా భారత యువకిశోరము చేతిలోంచి ఉరికిన మొదటి బాంబు అది బాంబు బండికి తగిలీతగలగానే చెవులు బద్దలు అయ్యే శబ్దం వచ్చింది. అదే సమయంలో రక్తం గడ్డకట్టే ఆర్తనాదం కూడా వినబడింది. ఏమి జరిగిందో గమనించకుండానే ఖుదీరాం, ప్రఫుల్లకుమార్‌లు చెరొక దిశ పరిగెత్తారు.

కింగ్స్‌ఫోర్డ్ చాలా అదృష్టవంతుడు. ఎందుకంటే, ఆ బాంబు వేసినపుడు ఆ బగ్గీలో అతను లేడు. అందులో ఫోర్డ్‌ని సందర్శించడానికి వచ్చిన అతని అతిధులు అయిన లాయర్ కెన్నడే, అతని భార్య, కుమార్తె, పనిపిల్లవాడు ఉన్నారు. వారు అంతా అక్కడికక్కడే మరణించారు ఖుదీరాం ఆ రాత్రి అంతా పరుగెత్తి 25 మైళ్ళ దూరంలో "వేణీ" అనే రైల్వే స్టేషనుకు సమీపంలోగల "లఖా" అనే ప్రదేశాన్ని చేరుకున్నాడు. అచ్చట ఆకలితో, ఆత్రుతతో ఉన్న ఖుదీరాం ఒక చిన్న షాపులో వేయించిన అటుకులు కొన్నాడు అచ్చట గుమికూడిన ప్రజలు ఆనోట ఆనోట బాంబు సంఘటన గూర్చి చర్చించుకొంటూ ఇద్దరు స్త్రీలు మరణించారు అన్న వార్త వినగానే ఒక్క క్షణం తన్ను తాను మరచి " అదేంటి కింగ్స్‌ఫోర్డ్ చావలేదా ?" అని అన్నాడు ఖుదీరాం. ఖుదీరాం మొఖంలోగల ఆత్రుత గమనించిన షాపు యజమాని పోలీసులకు రహస్యంగా కబురుచేశాడు పోలీసులు అతనిని నిర్బంధించి జైలుకు పంపించారు ఖుదీరాం ఏ మాత్రం భయపడలేదు. ప్రఫుల్లకుమార్ కొరకు పోలీసులు గాలింపుచర్యలు తీవ్రతరం చేశారు. కానీ ప్రఫుల్లకుమార్ ఏమైనానరే నేను బ్రతికిఉండగా

( తరువాయి 29 వ పేజీలో )

## నారద భక్తి సూత్రాలు-34

# భక్తి దర్శనాచార్యులు

"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

### శుకమహర్షి

ఈయన వ్యాసమహర్షి కుమారుడు. శుకమహర్షి తండ్రి వద్ద సకల విద్యాతత్త్వ సారం గ్రహించాడు విదేహ నగరంలో మహాతత్త్వజ్ఞాని అయిన జనక మహారాజు వద్ద ఆత్మ విద్య అభ్యసించాడు ఈయన సకల ఆగమార్థసారగాత్రుడు అకలంక చంద్రుడు. పరమ పవిత్రుడు. దేవతా స్తవనీయుడు ఈ మహా భక్తుడు శ్రీహరి యెడల పరమ విరహాసక్తి కలిగి విష్ణు గుణ మహాత్మ్యాసక్తితో పరితపించే భక్త్యాచార్యులలో ప్రధానుడు

ఈయన ఎక్కడా ఎక్కువసేపు నిలవడు ప్రశ్నకు సమాధానమీయకుండా వెళ్ళడు అది ఆయన స్వభావం వ్యాసుడు భారత భాగవతాదులు రచించి శుకుడికి శిష్యులకు బోధించి ధర్మ ప్రచారం చేయవలసింది అన్నాడు తండ్రి ఆజ్ఞ తలదాల్చి ధర్మబోధ చేశాడు.

పరీక్షిన్మహారాజు ఒకసారి వేటకు వెళ్ళి వేటాడి వేసారి దప్పికగొన్నాడు మంచితీర్థం లభించే దారే కనిపించలేదు ఆ రాజు ఒక మునిని అడిగాడు. ముని తపస్సమాధిలో ఉన్నాడు అతడు సమాధానమీయ లేదు రాజు చికాకుపడ్డాడు శమీక మహామునీంద్రుడని తలంచక మత్తుడెవరో అనుకొని విసుగుతో మృత సర్పాన్ని అటు విసిరి వెళ్ళిపోయాడు. ఆ పాము ముని మెడపై పడింది

ఇంతలో ఆ ముని కుమారుడైన శృంగి వచ్చి ఇది చూచి ఆగ్రహించాడు "మృత సర్పాన్ని నా జనకునిపై విసరినవాడు సప్తదివసాలలో సర్పంచేతనే మరణిస్తాడు" అని శపించాడు. మునికిది తెలిసి రాజును శపించినందుకు బాధపడ్డాడు. రాజుకు ఈ సంగతి తెలియపరచాడు

పరీక్షిన్మహారాజు తాను చేసిన పాపకృత్యానికి పరితపించి ముక్తిమార్గం "ఏమిటి" అని మహావిద్వాంసులతో పర్యాలోచన చేశాడు వారు శుకమహర్షిచే భాగవతం వింటే ముక్తి లభిస్తుందని విన్నవించాడు

అదృష్టవశాత్తు ఆ క్షణంలో అచటికి శుకమహర్షి వచ్చాడు రాజు వచ్చిన మహర్షిని పూజించి భాగవతం చెప్పి ముక్తి ప్రసాదించవలసినదిగా ప్రాధేయపడినాడు ప్రశ్న వెంట ప్రశ్న వేసి ఏడు దినములు భాగవతం చెప్పించుకొన్నాడు ప్రశ్నకు సమాధానమియక వెళ్ళలేడు కనుక శుకమహర్షి ఏడు రోజులు అలానే ఉండి విష్ణు కథలు చెప్పి మహారాజుకు మాధవలోక సౌభాగ్యం ప్రసాదించాడు

ఈ శుకమహర్షి నారదుని ద్వారా బ్రహ్మవిద్య పొంది గగన మార్గాన పరమాత్మలో సంధానం కావటానికి వెళ్ళుతున్నాడు ఇది చూచి వ్యాసమహర్షి పుత్రప్రేమకు లోనయి "హా! పుత్రా! పుత్రా! అని విలపిస్తూ విపినాల వెంట పుత్రుని వెంబడించాడు. అదే సమయంలో ఆ ప్రాంతంలోని ఒక సరోవరంలో దేవతాస్త్రీలు జలకాలాడుతున్నారు. శుకమహర్షి అటువైపు పయనించాడు శుకుణ్ణి చూచి కూడా ఆ దేవతాస్త్రీలు యథాతథంగనే వివస్త్రలై జలక్రీడలాడుతూనే ఉన్నారు. అటు తర్వాత వేదవ్యాసులవారు పుత్రుని పిలుస్తూ అటే వస్తున్నారు అది గమనించిన అప్సరసలు అసితంగా సిగ్గుపడి వస్త్రాలు సర్దుకొన్నారు. ఇది చూచిన

వ్యాసునికి సందేహం వచ్చి ఆ స్త్రీలను అడిగాడు వారు ఇలా అన్నారు –

"మహర్షి చంద్రా! మీ పుత్రుడు యుక్తవయస్కుడే. మహా మునీంద్రుడే కానీ ఆయన నిర్మమత నిరహంకారం నిర్గుణం గలవాడు ఆయన ముఖంలో పసిపాప లోని అమాయకత ఆప్యాయతలే కానీ కామ మోహ గుణాలు మచ్చుకు కూడా లేవు. వాసనాదులంటని పద్మం ఆయన ముఖం. అందువలన మేము ఆయనను చూచినా మమ్ము ఆయన చూచినా మనస్సులు మాతా శిశు ప్రేమలోనే నిండాయి. కానీ అన్యం కాలేదు. తమరు పెద్దవారైనా తమను చూడగానే మనోవికారాలు కలుగుతున్నాయి. తమలో ఆ పరబ్రహ్మ నిర్వికార గుణం కనిపించలేదు. అందువల్ల మేము తమరిని చూచి స్త్రీ సహజమైన సిగ్గును పొందాము" వ్యాసుడు సిగ్గుపొందాడు పుత్రుని ఉన్నత స్థితికి పొంగిపోయాడు తండ్రికి కావలసింది అదే కదా!

శుకుడు అలా కొంతదూరం వేగి పంచభూతాత్మకమైన ప్రకృతిలో లీనమై పరమాత్మను జేరుకొన్నాడు

సముడై యెవ్వడు ముక్త కర్మచయుడై
సన్న్యాసియై యొంటి పో
వ, మహాభీతి "ఓ పుత్రా! కుమారా!"
అనుచున్ వ్యాసుండు సీరంగ వృ
క్షములన్ తన్మయుతన్ ప్రతిధ్వనులు
సక్యంజేసె మునున్నట్టి భూ
తమయున్ ప్రముక్తోద బౌధు రా
యణి తపోధనాగ్రణిన్ ధీమణిన్

## శాండిల్యుడు

ఈయన భక్త్యాచార్యులలో సుప్రసిద్ధుడు నారద భక్తి సూత్రములవలె శాండిల్య భక్తి సూత్రాలు లోకప్రసిద్ధి గాంచాయి నిర్గుణోపాసనా పద్ధతి ఈయన కత్యంత ప్రీతి. ఈయన "ఆత్మరతి" యే నిజమైన పరతత్త్వ భక్తి అని ప  ంచాడు ఈ తత్త్వజ్ఞుడు మహాత్మ్య సక్తి గల భక్తవర్యులలో అగ్రేసరుడు.

ఒకసారి ఈ మహర్షి ధ్యానమాలినిపై మనసు పడ్డాడు ఆ దివ్యాంగన సుస్నాతయై మునిచంద్రుని సమీపించాలని గడువు కోరింది అందుకు ముని సమ్మతించాడు. ఇంతలో రావణుడు ఆ దివ్యస్త్రీని బలాత్కరించాడు. ఆమె విలపిస్తూ మునీంద్రునికి సంగతి విన్నవించుకొన్నది. అపుడు మునికి ఆగ్రహం వచ్చి "రావణా! నీవు కామ కారణంగా నరుని చేతిలో నశిస్తావు అంగనా నీవు మొసలివై ఈ మడుగులో పడిఉంటావు" అని శపించాడు.

ఆ దివ్యాంగన ముని పాదాలపై వ్రాలి "నాకు శాప విముక్తి ఎప్పుడు స్వామీ!" అని విలపించింది.

దయాళువైన మహాత్ముడు ఇలా అన్నాడు –

శ్రీరామకార్యార్థమై హనుమంతుడు ఈ మడుగువద్దకు వస్తాడు అపుడు ఆ మహాత్ముని స్పర్శతో నీకు శాప విముక్తి లభిసుంది.

రావణుడు రామచంద్రుని చేతిలో సంహరింపబడటానికి ఈ ముని శాపం కూడా ఒక కారణం.

ఈ భక్త్యాచార్యుడైన శాండిల్యుడు ఇంత మహిమాన్వితుడు మహాశక్తిసంపన్నుడు.

# కౌమారగీతి



(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 14-12-76

చిరంజీవులకు - ఆశీస్సులు.

లోగడ ఉత్తరంలో గురుభక్తి, మాతృభక్తి, పితృ భక్తిలను గురించి, వాటి ప్రాముఖ్యతను గురించి వ్రాశాను. వీటన్నిటికన్నా మించినది 'దైవభక్తి'. దీని ఆవశ్యకతను గురించి ఈ లేఖలో వివరిస్తున్నాను మరియు "సోదర ప్రేమ" విశిష్టతను గురించి కూడా వ్రాస్తున్నాను.

## దైవభక్తి

భక్తియను పుష్పము నుండి జ్ఞాన ఫలము ఆవిర్భవిస్తుంది కనుక ఈ చరాచరసృష్టి సర్వస్వానికి కారణభూతమైన పరమాత్మయందు అచంచలమైన, నిశ్చలమైన భక్తి కలిగియుండవలెను అట్టి అకలంక భక్తునికి ఒకవేళ శాస్త్రపరిజ్ఞానము, భౌతికమైన విద్య ఏకారణము చేతనైనా లేకపోయినప్పటికీ ఫరవాలేదు జ్ఞానోదయానికి అర్హుడే అవుతాడు. అతడు దేనిని అడుగుతే దానిని భగవంతుడు అనుగ్రహిస్తాడు ఎప్పుడు పిలుస్తే అప్పుడు ఎదుట నిలుస్తాడు భగవంతుడు జ్ఞాన నేత్రం లేనివాడు అనగా జ్ఞానోదయం కానివాడు, అతడెంత గొప్పవాడైనా, ఎంతటి విద్యావేత్తయైనా, ధనవంతుడైనా, బలవంతుడైననూ, సర్వాధికారములు గల చక్రవర్తియైననూ భగవంతుని దృష్టిలో మాత్రం గ్రుడ్డివాడే. అకలంకమైన దైవభక్తికి ఆదర్శం ప్రహ్లాదుడు అతని తండ్రి హిరణ్యకశిపునకు 'హరి' మాట అంటే గిట్టేది కాదు. 'హరి'ని స్మరించకుండా వుండేవాడే కాదు ప్రహ్లాదుడు 'హరి'ని స్మరించవద్దని ఎన్నో బాధలు పెట్టాడు హిరణ్యకశిపుడు ఏనుగులతో త్రొక్కించాడు, విషసర్పములను ప్రయోగించాడు. కొండలమీద నుండి దొర్లించాడు, కొరడాలతో కొట్టించాడు అయినప్పటికీ హరి నామ స్మరణను విడనాడ లేదు ప్రహ్లాదుడు ఏమి చేయాలో తోచక, విసిగివేసారి చిట్టచివర్కి "నీకు శక్తి వుంటే ఈ స్తంభంలో హరిని చూపించు" అని గర్జిస్తాడు హిరణ్యకశిపుడు స్తంభమును కోపంతో మూడు ముక్కలు చేస్తాడు అప్పుడు ఆ స్తంభం నుండి నృశింహస్వామి బయటకు వచ్చి హిరణ్యకశిపుని సంహరించి, ప్రహ్లాదునికి ఆనందం చేకూరుస్తాడు ఈ ఉదంతం వలన భక్తితో సాధించలేనిదంటూ ఏమీ లేదని స్పష్టమవుతున్నది ఎవరు నిశ్చలమైన భక్తితో, నిర్మలమైన చిత్తంతో భగవంతుని ఆరాధిస్తారో, అట్టి వారికి పరమాత్మ కరుణా కటాక్షములు ఎల్లప్పుడూ వుంటాయనే విషయం ఋజువవుతున్నది. కనుక మీరందరూ సర్వకాల సర్వావస్థలయందు భక్తిశ్రద్ధలు కలిగి వుండవలెను భగవంతుని నమ్మినవానికి ఎట్టి భయమూ ఉండదు.

## సోదర ప్రేమ

ప్రతి వ్యక్తి తన సోదరులను (అన్నదమ్ములను) మనసారా ప్రేమించవలెను ఆపదకాలములో హితం విడవకుండా, కష్టసుఖములలో పాలుపంచుకొనేవారే నిజమైన సోదరులు సోదర ప్రేమకు మంచి ఆదర్శము దశరథ కుమారులు (శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శతృఘ్నుడు) శ్రీరాముడు తండ్రి ఆజ్ఞానుసారం అరణ్యానికి బయలుదేరినప్పుడు లక్ష్మణుడు కూడా బయలుదేరుతాడు, శ్రీరాముడు వద్దన్నా వెంబడిస్తాడు

తన భార్యను, తల్లిని, తండ్రిని మరియు సకల భోగ భాగ్యములను తృణప్రాయంగా నెంచి అడవులకు పయనమైపోయి, సీతారాములకు అంగరక్షకునిగా, సకల సపర్యలూ చేస్తూ, చిట్టచివర్కి రావణ సంహారంలో శ్రీరామునికి కుడి భుజంగా నిలిచి పడరానిపాట్లు పడుతాడు లక్ష్మణుడు అన్నగారి యెడల వున్న ప్రేమ యొక్క ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటి చూపించాడు లక్ష్మణుడు శ్రీరాముడు కానల కేగునప్పుడు భరత శత్రుఘ్నులు అయోధ్యలో లేరు. శ్రీరాముని వియోగమునకు తట్టుకోలేక దశరథుడు మరణిస్తాడు ఆ మరణ వార్త విని తాతగారింటివద్దనున్న భరత శత్రుఘ్నులు అయోధ్యకు వస్తారు. శ్రీరాముని అడవులకు పంపినందులకు తల్లి కైకేయిని అనరాని మాటలు అంటాడు భరతుడు దశరథుని అంత్యక్రియలు పూర్తిచేసి సపరివారంగా అరణ్యాలకు వెళ్ళి శ్రీరాముని ప్రాధేయ పడుతాడు భరతుడు అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యమును పాలించమని వేడుకుంటాడు అవకాశం వచ్చింది కదాయని రాజ్యాన్ని స్వీకరించకుండా, నిస్వార్థబుద్ధితో ఎట్టి కల్లాకపటం లేకుండా శ్రీరామునికే పట్టాభిషేకం చేయటానికి ఎంతో ప్రయత్నం చేస్తాడు భరతుడు శ్రీరామునికి బదులు అతనే 14 సంవత్సరాలు అరణ్యవాసం చేస్తానని ప్రతిమాలుతాడు. లాభం లేక చిట్ట చివర్కి ప్రాయోపవేశం చేయటానికి కూడా సిద్ధమవుతాడు. అప్పుడు శ్రీరాముడు, వశిష్ఠాది మహర్షులు అతనిని ఓదార్చి రాజ్యాన్ని పాలించమని నచ్చజెపుతారు. గత్యంతరంలేక శ్రీరాముని పాదుకలు తీసుకొని, నెత్తి మీద పెట్టుకొని తిరిగి వెళ్ళిపోతాడు భరతుడు. కానీ మళ్ళీ అయోధ్యలో మాత్రం కాలు పెట్టడు. అయోధ్య ప్రక్కనే వున్న నందిగ్రామంలో మకాంచేసి శ్రీరాముని పాదుకలకు పట్టాభిషేకంచేసి, వాటి ప్రతినిధిగా 14 సంవత్సరాలు ప్రజానురంజకంగా రాజ్యాన్ని పాలిస్తాడు భరతుడు. సకల భోగ భాగ్యములను విడనాడి, నార బట్టలను ధరించి, ఒక "ముని" లా, ఎట్టి కోరికలూ లేకుండా జీవితాన్ని అతి నిరాడంబరముగా 14 సం. లు గడిపిన త్యాగమూర్తి భరతుడు. రావణ సంహారణానంతరం తిరిగి వచ్చిన శ్రీరామునికి స్వాగతం పలికి తిరిగి రాజ్యాన్ని వప్పగించిన త్యాగశీలి భరతుడు. సోదర ప్రేమకు చక్కటి ఆదర్శం భరతుడు ఒక పర్యాయం నాగపాశ అస్త్రమునకు గురియై రామలక్ష్మణులు యుద్ధంలో స్పృహ తప్పి పడిపోతారు. ముందుగా శ్రీరామునికి తెలివివచ్చి మూర్ఛలో నున్న లక్ష్మణుని చూచి "సీతలాంటివారు భూలోకమున ఎక్కడైనా లభిస్తారు కాని లక్ష్మణునితో సమానమైన సోదరుడు మాత్రం లభించుటదుర్లభం" అని విలపిస్తాడు మరొక పర్యాయం సీతాన్వేషణ సమయంలో కబంధుడను రాక్షసుని చేతిలో రామలక్ష్మణులు బంధింపబడుతారు. అప్పుడు లక్ష్మణుడు "నీవు నన్ను గూర్చి ఆలోచించడం మాని, కబంధునికి నన్ను బలిగాసర్పించి, నీవు సుఖముగా పారిపొమ్ము" అని శ్రీరాముని ప్రాధేయపడుతాడు లవణాసురుడనే రాక్షసుని సంహరించిన శత్రుఘ్నునికి బహుమానంగా మధురానగరమును పారితోషికంగా యిచ్చి పాలించమని శ్రీరాముడు ఆజ్ఞాపించగా అప్పుడు శత్రుఘ్నుడు అంగీకరించక " 14 సం లు శ్రీరాముని వియోగ దుఃఖమును పొందిన నాకు మరల ఈ వియోగము నుకల్పించవద్దు " తల్లి లేని శిశువువలె నిన్ను విడిచి ఒక్క క్షణమైనా వేరొకచోట వుండలేను " అని ప్రాధేయపడుతాడు. శ్రీరాముని సోదరులు ఒకరికి మించినవారు ఒకరు. వారి అప్యాయతను గురించి, సోదర ప్రేమను గురించి మానవాళి మనుగడ ఉన్నంతకాలం చెప్పుకుంటునే ఉంటారు. కనుక వారిని ఆదర్శంగా గైకొని, అప్యాయతతో, అనురాగంతో, ఎట్టి అరమరికలు లేకుండా, ఐకమత్యంగా, ప్రేమాభిమానములతో కలకాలం సుఖప్రదమైన జీవితాన్ని మీరందరూ గడపాలని నా ఆకాంక్ష.

ఉంటా ... ఇట్లు

మీ నాన్న

శ్రీవాణి

# మదాలస

మల్లాప్రగడ శ్రీరంగారావు

విశ్వావసువను ఒక గంధర్వరాజు కలడు అతనికి "మదాలస" యను కూతురుండెను. ఆమె మిగుల అందకత్తె. సౌందర్యముతోపాటు ఉత్తమ గుణవంతురాలు ఒకనాడు పాతాళకేతుడను రాక్షసుడు ఉద్యానవనములో విహరిస్తున్న మదాలసను, ఆమె చెలికత్తె యగు కుండలను చూచి అపహరించి యొక బిలములో దాచి పెట్టెను.

ఇంతకు పూర్వమే మదాలసకు పరాక్రమవంతుడు, యోగ్యుడు అయిన భర్త లభించునని తన తండ్రియింట ఒక ముని చెప్పిన మాటలు గుర్తు వచ్చి, ఈ బిలంలో దాచియుంచిన నన్ను ఎవరు గుర్తింపగలరు? ఈ దుర్మార్గుడు నన్నేమి చేయునో, ఆ ముని మాటలు ఫలించునో లేదో అని పరిపరివిధాల ఆలోచించి చివరకు ప్రాణత్యాగము చేయ సంకల్పించెను అపుడు కుండల యను చెలికత్తె మదాలసకు ధైర్యం చెప్పి ఈ రాక్షసుని వాలకం చూడగా నిన్నేమి చేయడనీ, ఎవరి కొరకో మనలను తీసికొనివచ్చి బంధించినట్లు కనబడుతోందని అనవసరంగా తొందరపడి ప్రాణత్యాగం చేసుకోవద్దని బోధించి ఆమె ప్రయత్నమును వారించెను.

ఒకనాడు గాలవుడను మునిచే కువలయాశ్వమును సంపాదించిన ఋతధ్వజుడనువాడు కువలయశ్వుడనే పేరుతో ధర్మకార్యములాచరించుచు అనేక యజ్ఞములు, దానములు చేయుచు ధర్మరక్షణకు దుష్ట శిక్షణకు సమర్థుడని పేరుగాంచెను

ఇట్టి కువలయాశ్వుడు పాతాళకేతుని సంహరించుటకై అనేక ప్రాంతములు గాలించి చివరకు అతను దాగియున్న బిలములోనికి ప్రవేశించి ఆ దుష్టుని సంహరింపబోగా వరాహరూపము పొంది మరొక్క బిలములో దాగెను కువలయాశ్వుడు కూడ ఆ బిలములోనికి చొరబడి వానితో పోరాడి సంహరించెను

ఈ సన్నివేశమంతయు చూచిన మదాలస కువలయాశ్వుని పరాక్రమమునకు, అతని ధార్మికదీక్షకు మనస్సులో సంతోషించి అంతటి మంచివాడు తనకు భర్తయైనచో తన జీవితము ధన్యమగునని భావించి జగన్మాతను ప్రార్థించెను

కువలయాశ్వుడు పాతాళకేతుని సంహరించి వచ్చి బిలములో నున్న మదాలసను, ఆమె చెలికత్తెయగు కుండలను చూచి, వారి వృత్తాంతము తెలుసుకొని చెలికత్తె యగు కుండల ద్వారా ఆ మదాలస తనకు భార్య కాదగినదని విని ఆమెను వివాహమాడి తన నగరానికి వెళ్ళి సుఖముగా జీవనము సాగించుచుండెను.

కొన్నాళ్ళకు తాళకేతుడను రాక్షసుడు కువలయాశ్వుడు నగరమున లేని సమయము తెలిసికొని మాయారూపంతో వచ్చి కువలయాశ్వుడు మరణించెనని అతని కంఠమాలను చూపించగా, నిజమనుకొని మదాలస ప్రాణములు విడిచెను.

కొంతకాలానికి తిరిగి నగరానికి వచ్చిన కువలయాశ్వుడు రాక్షసుని మాయా ప్రభావముచే తన భార్య మృతిచెందినట్లు తెలిసికొని విరాగియై యుండగ అశ్వతరుడను నాగరాజు శివుని మెప్పించి మదాలసను బ్రతికించి కువలయాశ్వుని పిలిపించి అతనికిచ్చెను. అతని దాన ధర్మములకు, సత్యదీక్షకు సంతసించి భార్యను బ్రతికించితిమని నాగరాజు చెప్పెను

ఈ మార్కండేయ పురాణ కథ వలన సత్య, దాన, దయా, ధర్మములున్నచోట మరణము కూడ వెనుకంజ వేయునని గ్రహింపవచ్చును. 

# ఓటమి నెరుగని ధీరులు

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

చేయగలవారు చేస్తారు. చేయలేనివారు చెబుతారు అంటాడు జార్జి బెర్నార్డ్ షా. చేయగల వ్యక్తి అద్భుతాలను సాధిస్తాడు. అట్టి అద్భుత వ్యక్తి చేతలను నేటి కర్ణాటక రాష్ట్రంలోని చిత్రదుర్గం జిల్లా మల్లాడి హాళ్ళిలో చూడవచ్చు.

అక్కడ రాఘవేంద్రస్వామివారున్నారు. ఆయన పీఠాధిపతి కాదు. ఆయనను సమర్థించు కుల సంఘం లేదు ఆయన అన్నిటిలా ఒంటరివాడు, ఆజన్మ బ్రహ్మచారి. ఆయన స్థాపించినది ఒక అనాధ సేవాశ్రమం. తనను తాను "తిరుక" (బిక్షగాడు) అని చెప్పుకుంటారు. అది వారి కలం పేరు.

వారిని మూడేళ్ళ క్రితం దర్శించే భాగ్యం నాకు కలిగింది. ఆయనకిప్పుడు వందా నాలుగేళ్ళ వయసు. ఇంకా యువకునిలా శ్రమిస్తున్నారు

ఆయన ఎక్కడివాడో ఎవరికీ తెలియదు. వయసులో వున్నపుడు భారతదేశమంతా పర్యటించారు హిమాలయాల్లో తపస్సు చేశారు అక్కడి యోగులతో వనమూలికావైద్యం నేర్చుకున్నారు. దేశ ప్రజల సేవ చేయాలన్న సంకల్పంతో, ఒకచోట స్థిరంగా వుండాలని సంకల్పించి, తిరిగి వస్తూ దారిలో మల్లాడిహాళ్ళి అనే కుగ్రామాన్ని ఎన్నుకొన్నారు యాభై ఏళ్ళక్రితం ఆ గ్రామంలో ఒక అనాధశరణాలయాన్ని ప్రారంభించారు.

ఆయనకు మతం లేదు, కులం లేదు మానవ కులమే ఆయన మతం, కులం.

తాము అనాధసేవాశ్రమస్థాపనకు ఎంపిక చేసుకున్న స్థలం ఒక వీర శైవ గురు, పరప్పస్వామి సమాధి వుంది. ఆ సమాధి ముందు వైపున సభలు, సమావేశాలు జరుపుతారు రాఘవేంద్రస్వామి, ప్రతి సంవత్సరం పరప్పస్వామి ఆరాధనోత్సవాలు జరుపుతుంటారు. వేలాదిగ ప్రజలు వస్తుంటారు ఆయన ఏనాడు కుర్చీపై కూర్చోరు అతిధులతోపాటు కిందనే కూర్చుంటారు.

ఆయన దుస్తులు అతి నిరాడంబరమైనవి. మోకాళ్ల దాటని నిక్కర్, అరచేతుల చొక్కా. మరేమీ వుండవు. యోగశాస్త్రంలోనూ, ఆయుర్వేదశాస్త్రంలోను వారు నిష్ణాతులు పాతిక ఎకరాల విస్తీర్ణం గల ఆశ్రమం అది. కిండర్ గార్డెన్ పాఠశాల, కళాశాల యోగ విద్యాలయ, ఉపాధ్యాయ శిక్షణ కళాశాల నిర్వహింపబడుతున్నాయి దేశంలోనే గొప్పదైన వనస్పతి ఉద్యానవనం పెంచారు. విదేశీయులు కూడా యోగవిద్యాభ్యాసానికై వస్తుంటారు వంద పడకల ఆయుర్వేద వైద్యశాల వుంది. అనాథలైన మహిళలకోసం శరణాలయం స్థాపించారు వృద్ధాశ్రమం నెలకొల్పారు. వందలాది విద్యార్థులతో చైతన్యవంతంగా వుంటుంది ఆశ్రమం.

అన్ని మతాల వారికి కులాలవారికి ఆశ్రియం కల్పిస్తున్నారు. మల్లాడిహళ్ళిలోని ముస్లిములకోసం స్వామీజీ మసీదు కట్టించి ఇచ్చారు. కొందరు స్వామీజీ వద్దకు వెళ్ళి 'స్వామీజీ ముస్లిములకు మీ పట్ల గౌరవం లేదు వారికోసం మసీదు నిర్మించటం సమంజసంగా లేదు' అన్నారు.

వారి మాటలను నిబ్బరంగా విన్న స్వామీజీ "వారు మనలను ద్వేషిస్తున్నారా? మనం కూడా వారిని ద్వేషిస్తే, వారికీ మనకు గల తేడా ఏమిటి?" ఆమాట విని అందరూ నిరుత్తరులయ్యారు.

స్వామీజీ ఎన్నో గ్రంథాలు రాసారు. స్వయంగా ముద్రణాలయం స్థాపించి పత్రికలు వెలువరిస్తున్నారు.

# సోదర ప్రేమ

- కప్పుల ఆంజనేయశర్మ

పదివేలమంది శిష్యులతో అతిథిగా వచ్చాడు దూర్వాసముని. సకల సౌకర్యాలు అమర్చాడు సుయోధనుడు. ఆయనకు ఆగ్రహం వస్తే శపించడం అనుగ్రహం వస్తే వరాలివ్వడం అలవాటు. అడగమన్నాడు దుర్వాసముని. పాండవవైరి అయిన కౌరవాగ్రజుడు ఇలా అడిగాడు.

" స్వామీ ! మా మీద చూపిన దయనే అడవులలో తిరుగుతున్న మా తమ్ముళ్ళమీద చూపి అనుగ్రహించండి. అదే నేను కోరుకొనే వరం " అన్నాడు.

సౌకర్యముమాట దేవుడెరుగు. అడవులలో తిరుగుతున్న ధర్మరాజుకి ఈ పదివేలమంది దుర్వాస శిష్యులకు కడుపునిండా తిండి పెట్టే శక్తి కూడా లేదనే సంగతి తెలిసే దుర్యోధనుడు దూర్వాసులవారిని అక్కడికి వెళ్ళమనడం. ఒకవేళ ఈ ముక్కోపికి వాళ్ళమీద కోపం వచ్చినా, బ్రహ్మాస్త్రంలాంటి శాపం ఒకటి వాళ్ళమీద విడిచివేస్తాడు. లేకపోతే కనీసం ఆకలితో వచ్చిన అతిథికి అన్నమైనా పెట్టలేదనైనా అవమానించవచ్చు ధర్మరాజుని. ఇదీ అసలు రహస్యం. పైకిమాత్రం సోదరులమీద ప్రేమ వెలిగిపోతున్నట్లు దూర్వాసుని అక్కడికి వెళ్ళమన్నాడు దుర్యోధనుడు.

త్రికాలవేత్త అయిన దూర్వాసుడు మనసులో బాగా నవ్వుకొన్నాడు. పైకి మాత్రం కొంచెం నవ్వి "సరే" అన్నాడు. పాండవులను అవమానించటానికే ఈ పన్నాగం అని ఆయనకు తెలుసు. ఇందులో అవమానింపబడేది దుర్యోధనుడేనని కూడా ఆయనకు తెలుసు.

పదివేలమంది శిష్యులతో అడవుల్లోకి వెళ్ళాడు దూర్వాసుడు. ఆ సమయానికి ద్రౌపదితో సహా పాండవులు భోజనాలు చేసేశారు. ఇంట్లో ఒక్క మెతుకు కూడా లేదు. వెళుతూనే స్నానాలు పూర్తయేటప్పటికి భోజనాలు సిద్ధంగా ఉండాలని ఆజ్ఞ ఇచ్చి నదికి వెళ్ళాడు ముని.

ద్రౌపదికి ఏం చేయటానికి తోచలేదు. అన్ని విధాల ఆదుకొనే ఆపద్బాంధవుడు శ్రీకృష్ణుని మనస్ఫూర్తిగా ప్రార్థించింది. శ్రీకృష్ణుడు వచ్చాడు.

ద్రౌపది మాట్లాడుదామని నోరు తెరచేటప్పటికి తనే మొదలుపెట్టాడు ' చెల్లీ ! ఆకలి దహించి వేస్తోంది, తొందరగా అన్నం పెట్టు' అని.

ద్రౌపదికి నోటి మాట రాలేదు. తేరుకుని అంది 'అన్నా ! ఆపదనుండి కాపాడవలసిన వాడివి నువ్వే అవమానిస్తున్నావా' అని.

పాంచాలి కదలకపోయేసరికి తనే గిన్నెలన్నీ వెతుకుతున్నాడు. ఆఖరికి తోమేసిన అక్షయపాత్ర అడుగున ఒక మెతుకు అంటుకొని ఉంది. అదే తిని తృప్తిగా త్రేన్చాడు శ్రీకృష్ణుడు. నదిలో స్నానం చేస్తున్న పదివేలమందికి 'బ్రేవ్ బ్రేవ్' మని త్రేన్పులు రావడం మొదలెట్టాయి. కడుపులు వాటంతటవే బరువెక్కాయి. నోళ్లు పంచ భక్ష్య పరమాన్నాలు తిన్నట్లుగా తియ్యతియ్యగా ఉన్నాయి. అప్పుడే విందు భోజనం ఆరగించినట్లు తృప్తిని పొందుతున్నారు. ఎందుకో తెలీదు. ఎలాగో తెలీదు. దుర్వాసులవారు మనోదృష్టితో చూశారు. సంగతి తెలుసుకొని పాండవుల వద్దకువెళ్ళి అనేక విధాల దీవించి కోరకుండానే వరాలిచ్చి వెళ్ళారు. పోతూపోతూ దుర్యోధనుడితో ఈ సంగతి చెప్పి మరీ వెళ్ళిపోయాడు దూర్వాస మహాముని. ◯

---

ప్రతి సోమవారం స్వయంగా చికిత్స చేస్తారు. వందలాది రోగులు వస్తుంటారు. అందరికీ ఉచితవైద్యం. అందరికీ భోజన వసతి సౌకర్యాలు ఉచితంగా సమకూరుస్తారు.

రెండు రోజుల తర్వాత వారిని దర్శించి సెలవు తీసుకొనటానికి వెళ్ళాను. " ఈ సేవాశ్రమం నాది కాదు. నేనొక బిచ్చగాణ్ణి. ఇది అందరిది. ఈ బిచ్చగాని జోలె కోట్లాది రూపాయలు సేకరించి వినియోగిస్తూవుంది. "ఇది మీది అన్న సంగతి మరువకండి " అన్నారు.

ఆయనకు బంధువులు లేరు. సమాజమే ఆయన బంధువర్గం. ఒక వ్యక్తి ఎంత సాధించగలడు ? అన్న ప్రశ్నకు రాఘవేంద్రస్వామి కృషే సమాధానం. ' క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే ' అన్న దానికి ప్రత్యక్ష ప్రమాణంగా ఈ సేవాశ్రమం చూడవచ్చు. ◯

# SRI SAI HARI REAL ESTATES

6/506, Besides Arya Vysya Chowltry

**PUTTAPARTHI** - 515 134

ANANTHAPUR Dt. ANDHRA PRADESH

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్ల స్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది చిరునామా వారిని సంప్రదించండి.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు కలవు.
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు కలవు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు కలవు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డువద్ద ప్లాట్లు కలవు.
5. అపార్టుమెంట్స్ కావలసినవారు కూడా సంప్రదించండి.

ప్రొప్రయిటర్

పి. సిద్ధయ్యశెట్టి

ఆర్యవైశ్య సత్రం ప్రక్కన

పుట్టపర్తి - 515 134

Phone : 2086

# పేదప్రజల పెన్నిధి డాక్టరు అహోబలరావు

కంచి వాసుదేవరావు

విద్య వైద్యం మానవ సేవాసాధనాలు తప్ప నార్జన మార్గాలు కావని ఒకప్పుడు భావించేవారు. పామరులకు విద్యాదానం చేసి జ్ఞాన సంపన్నులుగా గురువు తీర్చిదిద్దితే మానవుల ఆరోగ్యాన్ని కాపాడి ప్రాణదానం చేసేవాడు వైద్యుడు. వీరిద్దరూ దైవ స్వరూపులు. అందువల్లనే "గురుబ్రహ్మ, గురువిష్ణుః, గురుదేవో మహేశ్వరః" అని "వైద్య నారాయణః హరి" అన్నారు. ఇప్పుడు ఈ రెండూ సామాన్య మానవునికి అందుబాటులో లేని మార్కెటు వస్తువు లయ్యాయి. ఐతే వైద్యాన్ని పేదల సేవకు మార్గంగా తన ముక్తిమార్గంగా ఎన్నుకొన్న ప్రజా వైద్యులలో డా॥ కోకా అహోబలరావుగారు అగ్రగణ్యులు.

ఒకప్పుడు ముఖ్యంగా ఈ శతాబ్దం మొదటి మూడు నాలుగు దశాబ్దాల వరకు - బందరుకు అన్ని రంగాలలో చిరకీర్తిని తెచ్చిపెట్టిన మహనీయులు వున్నట్లే వైద్యరంగంలో వుండేవారు. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు మంచి డాక్టరు. ఆయన హస్తవాసి మంచిది. రాజకీయాలలో తలమునకలు కావడం వలన వైద్యవృత్తిని వదలిపెట్టినా ఆయన వచ్చి పరీక్ష చేస్తే కాని సంతృప్తి చెందని పుర ప్రముఖులు వుండేవారు. ఇంకా కోకా అహోబలరావు గారు, వేమూరి దుర్గానాగేశ్వరరావుగారు, డా॥ కవిపురపు సుబ్బారావుగారు, డా॥ ఎ ఎన్ రావుగారు అటువంటి వైద్యులే. మరొక విశేషం అనాటి బందరు డాక్టర్లు చాలామంది రాజకీయాలలో చురుకుగా పాల్గొనేవారు. అహోబలరావు ప్రత్యక్షంగా రాజకీయాలలో పాల్గొని జైలుకు వెళ్ళకపోయినా, అనాటి జాతీయ ఉద్యమాలకు సాంఘిక ఉద్యమాలకు ఎన్నుదన్నుగా వుండేవారు. వేమూరి దుర్గానాగేశ్వరరావుగారు జైలుకు వెళ్ళారు. డా॥ రాళ్ళపల్లి అచ్యుతరామయ్యగారు, డా॥ పోతరాజు శోభనాచలపతిరావుగారు కాంగ్రెస్ ఉద్యమాలలో పాల్గొన్నవారే. డా॥ కుప్పా వెంకట్రామశాస్త్రిగారు వైద్యవృత్తిలో వుంటూనే కమ్యూనిస్ట్ ఉద్యమంలో పాల్గొనేవారు ఈనాటికీ అనేక ప్రజాహిత ఉద్యమాలలో పాల్గొంటూనే ఉన్నారు.

## పేద రోగులకే అధిక ప్రాధాన్యం

అహోబలరావుగారు వైద్యులందరిలో తలమానికం అనదగినవారు. ధనసంపాదనకు ఆయన ఏనాడూ వైద్యవృత్తిని వినియోగించుకోలేదు. ఆయనకు అడిగినంత ఫీజులు యివ్వగల సంపన్న కుటుంబాల రోగుల కన్న, దొక్కాడితే కాని పూట గడువని పేద రోగులంటేనే ఎక్కువ అభిమానం. అందువల్లనే ముందుగా ఆయన తన దగ్గరకు వచ్చిన పేద రోగులను పరీక్ష చేసేవారు. వారికి డబ్బు తీసుకోకుండా వైద్య పరీక్షలు చేయడమేకాక మందులుకూడా ఇచ్చేవారు. ఈ సందర్భముగా పెద్దలు ఆయన గురించి చెప్పిన ఒక ఉదంతం ప్రస్తావించడం ఉచితంగా వుంటుంది. ఒక పేద లంబాడీ స్త్రీ ఆయన దగ్గరకు వైద్యానికి వచ్చింది. ఆమెను అహోబలరావుగారు పరీక్షించి మందులు ఇచ్చి, "అమ్మా బత్తాయి, నారింజపళ్ళు తినాలి' అని అన్నారట. దానికి ఆ పేద స్త్రీ "అయ్యా గంజి కాచుకుని తాగడానికే దిక్కులేని దాన్ని పళ్ళు ఎట్లా కొనుక్కుంటాను" అని అందట వెంటనే అహోబలరావుగారు జేబులోంచి ఇరవై ఐదు రూపాయలు - (ఆ రోజులలో ఇరవై ఐదు

రూపాయలంటే ఈ రోజులలో కనీసం రెండు వందల రూపాయలు) యిచ్చి, పళ్ళు కొనుక్కోమని చెప్పారుట. అహోబలరావుగారు మరణించినప్పుడు – ఆ లంబాడీ స్త్రీ తన యింట్లోని వ్యక్తి మరణించినట్లు విలపిస్తూ ఈ కథ చెప్పిందిట.

అహోబలరావుగారు ప్రతి ఉదయం సైకిలుమీద తిరుగుతూ రోగుల యిళ్ళకి వెళ్ళి చూస్తూ వుండేవారు. వారు రాసి యిచ్చిన మందులకు – వేమూరి కేశవరావు గారి మందుల షాపులో కొనుక్కుంటూ వుండేవారు. ఆ రోజులలో బందరులో కేశవరావుగారి మందులషాపే వుండేది ఎ. ఎన్. రావుగారి మందులషాపు, హెబ్బాల్ మందుల షాపులు అప్పటికి యింకా రాలేదు.

## చిట్కా వైద్యం

అహోబలరావుగారి వైద్యానికి సంబంధించినదే మరో సంఘటన గురించి విన్నాను. ఒక రోగికి వున్నట్లుండి నోరు మూతపడడం ఆగిపోయింది ఏం చేసినా ఆ నోరు మూతబడటంలేదు. చివరకు అహోబల రావుగారు ఒక చిట్కా చేశారు. ఎర్రగా కాలిన ఇనుప చువ్వను రోగి నోటికి అంటించబోయాడు. వెంటనే నోరు మూత పడిందట.

అహోబలరావుగారికి నారింజపళ్ళ డాక్టరని పేరు ఆయన తన వైద్యంలో నారింజతొనలవి, నారింజపళ్ళ రసాన్ని వాడేవారుట. నారింజపండ్లు లేనిదే ఆయన వైద్యం వుండేది కాదు. అదేవిధంగా బందరు వాస్తవ్యులు డా॥ కోకా నరసింహారావుగారు ఉబ్బస వ్యాధికి కొబ్బరిబొండాలతో చికిత్స చేసేవారు

అహోబలరావుగారు ఆజానుబాహువు తెల్లటి ప్యాంటు షర్టు ధరించేవారు. ఠీవి అయిన మీసాలతో గంభీరంగా వుండేవారు. ఆయన టెన్నిస్ క్రీడా కారుడు. ప్రతిరోజూ సాయంత్రం విధిగా కొంత సేపు టెన్నిస్ ఆడుతూ వుండేవారు చివరకు టెన్నిస్ ఆడుతూ వుండగానే గుండెపోటు వచ్చి మరణించారు. ఎంతో పుణ్యం చేసుకుంటే తప్ప సునాయాస మరణం లభించదంటారు ఆయన మరణించినప్పుడు ఆయన భౌతికకాయానికి శ్రద్ధాంజలి ఘటించడానికి బందరు పట్టణంలోని ఆబాలగోపాలం తరలివచ్చిందని పెద్దలు చెప్పగా విన్నాము.

ఆయన ఒక క్రైస్తవ స్త్రీని పెళ్ళి చేసుకున్నారు. ఆవిడ మరణించినప్పుడు, ఆమె అంత్యక్రియలను అహోబలరావుగారు పూర్తి క్రైస్తవ పద్ధతుల్లో జరిపించారుట. ఆయనకు అనేకమంది క్రైస్తవమిత్రులువుండేవారు.

## చరిత్రాత్మక సంఘటన

ఆ రోజులలో బందరు నాయుళ్ళలో అహోబలరావు గారు, శీలం జగన్నాధరావుగారు ప్రముఖులు. అహోబలరావుగారు కాంగ్రెస్ అభిమాని కాగా జగన్నాధరావుగారు జస్టిస్ పార్టీ ప్రముఖులు జగన్నాధ రావుగారు బందరు మున్సిపల్ ఛైర్మన్‌గా వుండేవారు. ఆ రోజులలో బందరు స్వాతంత్ర్య సమర చరిత్రలో ఒక ప్రధాన సంఘటన జరిగింది అప్పుడు యువకుడైన తోట నర్సయ్య బందరు కోనేరు స్తంభంపై కాంగ్రెస్ పతాకాన్ని ఎగరవేయ ప్రయత్నిస్తున్నప్పుడు పోలీసులు దారుణంగా లాఠీఛార్జి చేశారు నర్సయ్యగారు స్పృహ తప్పి పడిపోయారు. ఈ సంఘటన బందరు పౌరులను తీవ్రంగా కలచివేసింది. పోలీసుల రాక్షసత్వాన్ని అందరూ ఖండించారు. అహోబలరావుగారితోపాటు జగన్నాధరావుగారు కూడా ఈ సంఘటనకు బాధపడ్డారు. దీనికి తగిన పరిహారం మున్సిపల్ ఆఫీసుమీద కాంగ్రెస్ జండా ఆవిష్కరణ. ఆ కార్యక్రమం నిరాఘాటంగా జస్టిస్‌పార్టీ ప్రముఖులైన జగన్నాధరావుగారి ఆధ్వర్యంలో జరిగింది. దీనికి అండగా నిలిచినవారు అహోబలరావుగారు.

డాక్టరు రాళ్ళపల్లి అచ్యుతరామయ్యగారు మున్సిపల్ ఛైర్మన్‌గా వుండగా బందరు పట్టాభి మార్కెట్టులో నిర్మించిన నాలుగు బ్లాకులకు బందరు పట్టణానికి విశిష్ట సేవలు చేసిన నలుగురు పురప్రముఖుల పేర్లు పెట్టుకున్నారు. వారు కోకా అహోబలరావుగారు, శీలం జగన్నాధరావుగారు, చెరకువాడ నరసింహంగారు, కోపల్లి హనుమంతరావుగారు. కాని దురదృష్టవశాత్తూ బ్లాకులపై వారి పేర్లు మాసిపోయాయి. వాటిపై ఏవో పోస్టర్లు వెలిసాయి. ఏ బ్లాకుకు ఎవరి పేరు పెట్టారో వారు బందరు పట్టణానికి చేసిన సేవలు ఏమిటో ఈ తరం వారికి ఎవరికీ తెలియదు. తెలియచెప్పాలనికూడా ఎవరూ ప్రయత్నించడంలేదు. బందరుకు ఎనలేని ప్రతిష్ట తెచ్చిన ఎందరో మహనీయుల స్మృతులు పూర్తిగా కాలగర్భాన మరుగుపడిపోతూ వుండడం దురదృష్టకరం.

# గీత - అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా
శాశ్వతీ స్సమాః।
శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టో౽
భిజాయతే॥

— పరమ పవిత్రమైన ఆధ్యాత్మిక మార్గమున పయనిస్తూ గమ్యంచేరక మధ్యలోనే యోగమునుండి దూరుడైన వాని గతేమని అర్జునుల వారు ప్రశ్నింపగా భగవానుడిచ్చుట సమాధాన మొసంగు చున్నారు.

ఆధ్యాత్మిక మార్గమున వేసిన ఏ ఒక్క అడుగు కూడనూ వృధాకాదు. కాలు జారి క్రింద పడిన వాడు తిరిగి లేచి అక్కడ నుండే తన నడకను ప్రారంభించు నుకానీ, తిరిగి మొదటినుండి నడవవలసిన పని లేదు. అట్లేయోగారూఢులైన సాధకులలో కొందరికి కొంత కాలానికి ఏదో ఒక విషయేచ్ఛ లోన జనిస్తుంది. నడిచి వెల్తున్న వానికి దారిలో రూపాయి కాగితం కనిపించ గానే తన నడకను ఆపి క్రిందకు వంగి ఆ కాగితం తీసుకున్నట్లుగా: విషయేచ్ఛ జనించిన యోగారూఢులు తమ సాధనకు భంగమును కల్గించుకొన్నవారలై ప్రాకృత దృష్టికి లోనై విషయాదుల వైపుకు వంగు తారు. మానవులకు విషయ సుఖాలు పుణ్యఫలము వలననే లభిస్తాయి. ఐతే యోగారూఢులు నిరంతర దైవచింతన చేస్తూ ఆచరించే సమస్త కర్మలు పుణ్య కర్మలుగానే ఔతాయి. అందువలన వారు ప్రత్యేకంగా పుణ్యకర్మలంటూ ఏవీ సలుపకున్నప్పటికినీ వారికి పుణ్యాత్ముల పొందు లోకము (స్థితి) ప్రాప్తిస్తుంది. ఏ విషయానుభవమును ఇచ్ఛగించి యోగమును విడిచి పెట్టునో అట్టి విషయానుభవములను ఆ యోగి పొంద గలడు. ఆ విషయమునందు అతనికి ఏహ్యత పుట్టు నంతవరకునూ అతనికి ఆ అనుభవము ప్రాప్తిస్తుంది.

యోగభ్రష్టమనగా పరమాత్మ చింతననుండి ప్రాకృత చింతనకు దిగుచే. ప్రాకృతచింత భ్రష్ట త్వము, పరమాత్మ చింత శిష్టత్వము కనుక నిరంత రము దైవ చింతనను చేస్తుండాలి ఈశ్వరోపాసన నుండి ఇహ వాసనలలోనికి దిగి దేహం చాలించినవారు తిరిగి శుచవంతుల, శ్రీమంతుల ఇండ్లలో పుడతారని భగవానుని బోధ శుచివంతులనగా ఇల్లు వొళ్లు శుభ్రంగా ఉన్నవారిని, శ్రీమంతులనగా ధనం గలవారనీ చాలామంది అభిప్రాయము. అది ఎంతమాత్రము సరికాదు

"శుచి" అనగా హృదయ పరిశుద్ధత, గుణ పరి శుద్ధత అని అర్థము. శ్రీమంతులనగా భావ దారిద్ర్యము లేక ప్రేమధనము, భక్తిధనము, జ్ఞానధనము, శీల ధనము కలిగినవారని అర్థము. కనుక మహానుభావు లైన యోగభ్రష్టులు గుణవంతులకు, భక్తివంతులకు, శీలవంతులకు తిరిగి జన్మించి తమ పూర్వసాధనను తిరిగి ప్రారంభించి కృతార్థులుగా మారి, అందరినీ కృతార్థులను చేయగలుగుతారు.

నేటి ప్రజలు శీలరహితులై, గుణరహితులై, నీచులై దైవప్రబోధలను వింటూ కూడా ఏ కొంచమైననూ ఆచ రింపక అశ్లీల సాహిత్యాలను పఠిస్తూ, నీచమైన గుణా లను, సంకల్పాలను అందించే సినిమాలను, టీవీలను చూస్తూ పశుప్రాయులుగా జీవిస్తూ, దురభ్యాసముల పాలవుతూ రావటం వలన వీరికి మహానుభావులు పుట్టటంలేదు. పశువులకు పశువులు జనించునే తప్ప పశుపతి జన్మించదని గీతా బోధ. కావున ఆధ్యాత్మిక తత్పరులు, ముఖ్యముగా భగవాన్ శ్రీ సత్యసాయీశ్వ రుల భక్తులమనుకొనేవారు సినిమాలు, టీవీలు చూడ రాదు. నవలలవంటివి చదవరాదు, దురభ్యాసాలుండ రాదు అప్పుడే మనకు సార్థకత. మన వలనసార్థకత.

# జడ మహర్షి

పురాణపండ "శ్రీచిత్ర

పూర్వకాలమున భార్గవుడను ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు సజ్జనుడు, వేదశాస్త్ర పారంగతుడు, గృహస్థు ఆయనకు ఒక కుమారుడు జన్మించాడు. ఆ బిడ్డను గారాబంగా పెంచి, ఉపనయనము చేసి వేదముల నభ్యసించమని చెప్పాడు. ఆ పుత్రుడు వినీవిన నట్లు వూరుకున్నాడు. మళ్ళీ చెప్పాడు ప్రయోజనం లేకపోయింది మూడవ పర్యాయం చెప్పాడు. అప్పుడు ఆ పుత్రుడు " తండ్రీ ! నా కిది ఎన్నో జన్మయో నీ నీ కడుపున కుమారుడనై పుట్టితిని. నా కన్నియును వచ్చును. ఎవరినీ ఆశ్రయించనవసరం లేదు వేదాభ్యాసము అనవసరము. నాకు మోక్షం కావాలి. అన్నియు తెలిసిన నేను మీ పలుకులు విని జడుడనై ఉంటిని. మీరు ముమ్మారు చెప్పగా నాకు నవ్వు వచ్చినది నాకు " జడ " నామము సార్థకమైనది అప్పుడు తండ్రి "కుమారా ! బుద్ధిమంతుడవైన నీకు జడత్వమెందుకు కలిగినది? శాపమేమైనా కలదా ? వివరంగా చెప్పుము" అని కోరగా అప్పుడు " తండ్రీ ! వినుము. నేను వెనుకటి జన్మయందు ఒక బ్రాహ్మణుడను నా వద్ద అనేకమంది శిష్యులుండేవారు. వారికి జ్ఞానబోధ చేశాను నాకీ జన్మమున పుట్టగనే జ్ఞానమబ్బినది. నేను విర్మలుడను. మోక్ష మార్గం అన్వేషించాలి. నన్ను ఆశీర్వదించి పంపండి. నే నిక మీ వద్దకు రాను " అని పలుకగా భార్గవుడు ఆశ్చర్యపడినాడు.

తరువాత తండ్రికి "జడుడు" అనేక పరమ రహస్యాలు వివరించాడు. "నీచుని కడ దానము పట్టరాదు. అట్టివాడు గాడిదయై పుట్టును. గురువును మోసగించిన కుక్కగా జన్మించును. గురువు భార్యను రమించినవాడు గాడిదగా పుట్టును. పెద్దల మాట పెడచెవినపెట్టినవాడు గోరువంకగా మారును మనోబాధ కలిగించువాడు తాబేలై జన్మించును. ఒకని ఇంట తిని, అతని శత్రువును చేరినవాడు కోతియై పుట్టును. విశ్వాసహీనుడు చేపయై పుట్టును అసూయాపరుడు దేగయగును. ధాన్యం హరించినవాడు కొంగగా జన్మించును ఆడవారిని, ముసలివారిని, పసిపాపలను చంపినవారు క్రిములగుదురు " అని ఈ విధముగా ఎన్నో విషయాలు 'జడుడు' చెప్పాడు. మరియు ఇంకా అనేక పరమ రహస్యములు తండ్రికి తెలిపి యోగాభ్యాసము చేయమని పలికాడు. "యోగికి అవమానము అమృతము, గౌరవము విషము. త్రావునుదకము వస్త్రపూతము, అడుగుపెట్టుచోటు దృష్టిపూతము. పలుకు సత్యపూతము. తలపు బుద్ధిపూతము యతికి కావాలి ప్రణవము జపించాలి. మోక్షసాధనకు కృషి చేయాలి " అని జడుడు పలుకగా తండ్రి భార్గవుడు విస్తుపోయి, వానప్రస్థయై ఇంద్రియములను జయించి పరమపదమందాడు.

తాను తరించి తండ్రిని తరింపచేసినవాడు జడుడు. జడమహర్షి అతి పవిత్రుడు, జ్ఞాని. జనన మరణ రూపమైన చక్రము తెలిసినవాడు, రౌరవాది నరకాలు తెలిసినవాడు కనుక ఈ మహర్షి చరిత్ర విన్నా, చదివినా, ప్రచారం చేసినా మోక్షప్రదమే. ○

# అజీతాశ్యామ శరదశ్శతం

.డా॥ రాపర్ల జనార్ధనరావు

ప్రాచీన ఋషులు రాబోవు తరాలవారు వేదాలు పఠించలేరని వాటిలోగల ముఖ్య భాగాలన్నిటినీ ప్రోది చేసి సంధ్యావందనం అనే పేరిట అనుదినం అనుశ్చ తంగా వేదభావన మన వంశీయులలో ఏర్పాటుచేశారు. సంధ్యావందనంలో సూర్యోపాసన, గాయత్రిమంత్రము, ఉదకమంత్రములు ఉన్నవి. అందులో ఒక ఋక్కు ఇలా వుంది.

" జీవేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం...
అజీతాశ్యామ శరదశ్శతం "

దీర్ఘాయువునుగూర్చిన వేదమంత్రం ఇది. నూరేళ్ళు జీవించాలి అనేది మన భారతీయ సాంప్రదాయబద్ధమైన ఆశీస్సు, అభిలాష. 'దీర్ఘాయుష్మాన్ భవ' అని ఆశీర్వ దించటం వ్యక్తిని పూర్ణజీవితం జీవించమనేది ఒక కోరిక. "శతమానంభవతు, శతాయుః పురుష" అనేది శుభాశీస్సు వెనుక ఎంతయో నిగూడార్థముంది సాధారణంగా ఈనాటి మానవుడు "నూరేళ్ళుబ్రతుకేందు కు బాబు బాధలు లేకుండా త్వరగా ఆ దేవుడు తీసికొని వెళ్ళితే చాలు" అనే భావం వ్యక్తీకరించటం కద్దు. నిజమే. బాధలతో కూడిన నూరేళ్ళ జీవితం ఒకవిధమైన నరకమే రోగంతో మంచానపడి, ఇతరులపైఆధారపడి పరులు వీరికి సేవచేయలేక ఈసడింపులు పలకటం మొదలైన దైన్యలక్షణాలతోటి నూరేళ్ళజీవనం బాధా యుతమైనదే. అభిలాషింపరానిదే. ఆశీర్వదింపరానిదే కూడాను. "అనాయాసేనమరణం, వినాదైన్యేన జీవితం" హెచ్చు బాధపడకుండగ మరణించటం, దీనత్వములేని జీవితాన్ని ఆశించమని ఉపోద్ఘాటింపబడింది. మరి నూరేళ్ళు బ్రతకమని ఆశీర్వచనము కదా, ఎలా జీవిం చాలని ఉద్దేశింపబడింది? ఈ ప్రశ్నకి సమాధానమే నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతం, ... అజీతాశ్యామ శరదశ్శతం "

నూరేళ్ల 'నందామ' ఆనందంతో జీవించు 'మోదామ' మోదము కలిగించుచూ, అనగా తాను ఆనందముగ జీవించుటయే గాక, ఇతరులకు కూడ మోదము కలిగించుచూ నూరేళ్ల జీవించాలి. ఎంతటి ఘనమైనది ఈ ఆర్ష భావన! బాధలతో నూరేళ్ళు జీవించమనలేదు. "నందామ శరదశ్శతం" ఆనందంతో ఆనందం కలుగజేస్తూ నూరేళ్ళు జీవించాలి అని ఋషి వాణి. ఇంతవరకు భావన మేలుగా ఉంది. అయితే ఇంకొక భాగం ఎంతో ముఖ్యమైనది ఈ మంత్రంలో చేర్చబడింది. "నందామ" "మోదామ" అని మెట్టు మెట్టు శుభ్రభావనలను అధిరోహిస్తూ చివరకు "అజీతా శ్యామ శరదశ్శతం" అని ముగించబడింది అనగా "అజేయుడవై నూరేళ్ళు జీవించాలి" ఈ అజేయమనే భావన ఎంతో ఉత్కృష్టమైనది. అనగా ఇతరులతో ఓడింపబడక అజేయుడవై ఉండవలెనని భావము. విజయాన్ని ఆకాంక్షించటం ఈ మంత్రం ద్వారా భారతీయ సంస్కృతి దృగ్గోచరం అవుతుంది సామాన్య మానవుని ప్రతినిధియే నరుడు లేక అర్జునుడు. నరనారాయణ సంవాదమే భగవద్గీత. అట్టి మన ప్రతినిధియైన అర్జునునకు 'విజయుడు' అని నామం ఉండటం ఒక ముఖ్య విశేషం.

" అజీతాశ్యామ శరదశ్శతం " " అజేయునిగ నూరేళ్ళు జీవించటం అనేది భావనలో గల ముఖ్యో ద్దేశ్యం కామ క్రోధాది అరిషడ్వర్గాలకు లోను గాక అజేయుడవై వుండవలయును అని ప్రత్యేక భావన. దేశాల న్నిటిని జయించినవారైనా అరిషడ్వర్గాలకు

లోనైతే ఆ రాజ్యాలు విలాసజీవనానికి లోనైన ప్రజలు రాజుల వలన అంతరించిపోవటం, ఈజిప్టు, రోమన్ మొదలగు రాజ్యాలు క్షీణించటం, మనము చరిత్ర పుటలలో చూచుచున్న విషయమే. అలెగ్జాండరు మన దేశం మీదికి దండెత్తి వచ్చినప్పుడు అరణ్యంలో ఒక మహర్షి కృష్ణాజినంమీద పడుకొని సూర్యుని చూస్తున్నాడట. అలెగ్జాండరు అతని వద్దకు వచ్చి "మహర్షీ! నేను అలెగ్జాండరు చక్రవర్తిని. నీకేమి కావలయునో కోరుకొమ్ము" అన్నాడట. ఆ మహర్షి "నీవు నాకూ సూర్యునికీ అడ్డం వచ్చావు. తప్పుకో. అదే నేను కోరేది" అన్నాడట. అలెగ్జాండరు అతని అనుచరులు ఈ మాటలు విని దిగ్భ్రాంతి చెందారట. ఇది గ్రీకు దేశవాసులు అలెగ్జాండరు యాత్రను గూర్చిన విశేషాలలో తెలుపబడింది. "అజీతా శ్యామ శరదశ్శతం" అన్న భావన మూర్తీభవించినట్లు ఈ సంఘటనలో తెలుస్తుంది.

"అయితే అజేయమనెడి భావన కేవలము అంతర్గతమైన విషయమే కాదు బాహ్యమైన భౌతికపరమైన రాజకీయ పరమైన, భౌగోళికమైన భావన కూడ ఇందు స్ఫురింపపడుతోంది. విదేశ పాలనకు లోనుగాక, బానిస బ్రతుకుల పాలుగాక, అజేయముగ జీవించటం ఆశింపబడింది సంధ్యావందనంలోని ఆశయం కేవలం అంతర్గతమైన శుద్ధ భావనలనే నియము కాలేదు. "సబాహ్యోభ్యంతర శ్శుచిః" అనగా బయట, లోపల శుచిని కాంక్షించుట ఒక విశేషము. అటులనే విజయత్వము బాహ్యముగను, అంతర్గతముగను, కలిగి నూరేళ్ళు జీవించటం "అజీతాశ్యామ శరదశ్శతం" అనెడి మంత్రము పరమోత్కృష్టమైన ఆర్ష భావన ○

## దీనబంధు

"నీతి జీవనంబు నిలువెల్ల కంపించి
భయము చెందుచున్న భారతంబు
తరుణమెంచి సత్యతత్త్వంబు బోధించు
దివ్యప్రభల వెల్గు దీనబంధు"
"మనుజజాతిని బ్రోవంగ మహికి దిగిన
భరత సంస్కృతి గంగవో భవ్యతేజ
పర్తిపురవాస దివ్యాత్మ భళిరసాయి
దివ్యప్రభల వెల్గు దీనబంధు"
"ఆర్తి బాపి మమ్ము నాదరించుము దేవ
నీదు దయను మమ్ము నిలుపవయ్య
నీదు నామస్మరణ నిత్యమే మరువము
దివ్యప్రభల వెల్గు దీనబంధు"

— గుడిశేప నరసింహారావు

## సత్యమైన మాట సాయి మాట

మానవుని మోసగించగలవు
మాధవుని మోసగించలేవురా
మర్మమది యని తెలిసి మసలుకోరా
సత్యమైన మాటరా, సత్యసాయి మాట.
మధుర చిరునవ్వులు చిలకాలి
మల్లెల ఘుమఘుమ లుండాలి
మాటలలో మధుర వీణలు మ్రోగాలి
సత్యమైన మాటరా, సత్యసాయి మాట.
అందరిని దీవించమంటావు
అందల మెక్కించమంటావు
అందుకనే, అర్హత కావాలి కదరా
సత్యమైన మాటరా, సత్యసాయి మాట.

— రాజ్యలక్ష్మి రంగారావు.

# అనుకున్నంత సులభంకాదు విద్యాబోధన

——ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

విద్యాబోధన అనగానే భాగవతంలోని ప్రహ్లాదుని చరిత్ర చప్పున జ్ఞాపకం వస్తుంది నాలుగు స్తంభాల మీద నిలిచిన భవంతిలాగా విద్యాబోధనకూడా నాలుగు వ్యవస్థలమీద బలంగా ఆధారపడి వుంది. మొదటిది- బోధించేవాడు లేదా గురువు. రెండవది- నేర్చుకునే వాడు లేదా విద్యార్థి మూడవది- చదివించటానికి విద్యార్థిని ప్రేరేపించేవాడు. ఈ స్థానంలో ముఖ్యంగా తల్లిదండ్రులు గాని, పోషకులుగాని, మిత్రులుగాని, ఉంటారు. నాలుగవ వ్యవస్థ- విద్యాబోధన విధానాన్ని రూపొందించేవారు లేదా విద్యా ప్రమాణాలను పరీక్షించేవారు. ఇది ఇప్పటి ప్రభుత్వంవారి విద్యాశాఖ వంటిదని చెప్పవచ్చు. ఈ నాలుగు వ్యవస్థలు పనిచేసే తీరు భాగవతంలోని ప్రహ్లాదుని కథలో చిత్రింపబడ్డాయి. అయితే, ఆ కథా తాత్పర్యానికి అనుకూలంగా మాత్రమే.

హిరణ్యకశిపుడు తన కొడుకును చదివించాలని సంకల్పించుకొన్నాడు. 'విద్యాబోధన' కథ ఎప్పుడైనా, ఎక్కడైనా ఇక్కడే ప్రారంభమౌతుంది. తల్లిదండ్రులు బిడ్డలను చదివించాలని ముందుకురావాలి.

" చదువని వాఁ డజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!"
(భాగ 7, 130)

అని హిరణ్యకశిపుడు ప్రహ్లాదునికి ఉత్సాహం కలిగిస్తాడు చదువకపోతే మనిషి చీకట్లోనే ఉండిపోతాడు చదివితే జ్ఞానమనే వెలుగులోకి వస్తాడు. జ్ఞానమంటే సదసద్వివేకంతో కూడుకున్న బుద్ధి నైపుణ్యం. దీన్ని మానవులందరూ తప్పక సాధించాలి. అందువల్లనే "చదువగ వలయును జనులకు" అని భాగవతప్రబోధం. అది నేటి నిర్బంధ విద్యావిధానాన్ని ధ్వనింపజేస్తున్నది.

"చదివించెద నార్యులొద్ద చదువుము తండ్రీ !" అన్న హిరణ్యకశిపుని మాటల్లో మరొక విశేషం గోచరిస్తుంది. కొడుకును చదివించటానికి తండ్రి యోగ్యుడైన ఉపాధ్యాయుణ్ణి ఎన్నుకోవాలి. ఆతని దగ్గర ఇష్టంతో చదివేటట్లు కొడుకునుగాని, కూతురును గాని ప్రోత్సహించాలి. ప్రహ్లాదునిపట్ల తండ్రి అదే పని చేశాడు

తండ్రి తగిన గురువు దగ్గర కొడుకును చేర్చటం నాటి పరిపాటి; తగిన విద్యాలయంలో చేర్చటం నేటి తల్లిదండ్రుల బాధ్యత. అందులో యోగ్యులయిన ఉపాధ్యాయులుంటారని నిశ్చితార్థం. పాఠశాల యాజమాన్యంగాని, ప్రభుత్వ విద్యాశాఖగాని ఉత్తమ అధ్యాపకులను నియమించే బాధ్యత ప్రజాస్వామ్యంలో స్వీకరిస్తారు. విద్యార్థి విద్యాలయంలో చేరిన తరువాత ప్రహ్లాదునిలాగా-

' ఏ పగిది వారు సెప్పిన
నా పగిదిం జదువుఁగాని, యట్టిట్టని యా
క్షేపింపఁడు '- (భాగం-7-135)

పాఠశాలల్లో ఉపాధ్యాయులు నేర్పించే చదువు: చేసిందే బోధ అనే ప్రామాణిక బుద్ధి చిన్నపిల్లల్లో ఉంటుంది. కాబట్టి, వారిని తీర్చి దిద్దేపూర్తి బాధ్యత ఉపాధ్యాయుల మీదా, వారి విద్యా బోధన పద్ధతులమీదా ఆధారపడి ఉంటుందనటంలో అనుమానం లేదు.

నేటి ఉపాధ్యాయుల్లాగా హిరణ్యకశిపుని రాజ్యం లోని గురువులు కూడా తాము సరిగ్గా పాఠాలు చెపుతున్నదీ లేనిదీ ప్రభుత్వం పరీక్షచేసినప్పుడు నిరూపించుకోవలసివచ్చేది. పాఠ్య ప్రణాళికను ప్రభుత్వం నిర్దేశించినట్లే చెప్పవలసివచ్చేది. ఈ పద్ధతిలో ఉపాధ్యాయుడు ముందుగా ప్రభుత్వానికి బాధ్యుడు : విద్యార్థులకెప్పుడూ ఆరాధ్యుడే. బాధ్యతను గుర్తించిన గురువుగా చండామార్కుడు కనపడతాడు -

" నీ పాపనిఁ జదివింతుము
నీ పాదములాన ! యింక నిపుణత తోడం ;
గోపింతుము ; దండింతుము ;
కోపింపకుమయ్య ! దనుజకుంజర ! వింటే !
(భాగ -7-154)

ఈ మాటలు నేటి ఉపాధ్యాయునికి అన్వయించుకుంటే_ "సముచితమైన విద్యాబోధన పద్ధతులతో మీ పిల్లలను చదివిస్తామని తల్లిదండ్రులకూ, ప్రభుత్వానికీ నేను హామీ యిస్తు" న్నానని ప్రతిజ్ఞ చేస్తున్నట్లుంటుంది. వృత్తిలో ప్రవేశించేటప్పుడు ప్రతి అధ్యాపకుడూ చేసే నిశ్శబ్ద ప్రతిజ్ఞే యిది.

గురువులు విద్యాబోధ చేస్తున్నారు. తన కొడుకుకు చదువెంత అబ్బిందో తెలుసుకోవాలని ఉబలాటపడతాడు హిరణ్యకశిపుడు. కొడుకును పిలిపించి ఇలా అడుగుతాడు -

" చోద్యంబయ్యెడి ; నింతకాల మరిగెన్ ;
శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు ;
తే వెంటం బందింపించిరో
విద్యాసార మెఱుంగఁ గోరెద ;
భవద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యం బొకట్టి చెప్పి, సార్థముగ,
దాత్పర్యంబు భాషింపుమా ! "
(భాగ -7-163)

ఈ పరీక్షించే హిరణ్యకశిపుడు రెండు వ్యవస్థలకు ప్రతినిధి ఒకటి - ప్రభుత్వం, రెండు-తల్లిదండ్రులు' విద్యను నేర్చుకుంటున్న విద్యార్థులకు పరీక్ష అవసరం. దానిని బట్టి విద్యాబోధన, విద్యాసాధన ఏ ప్రమాణాల్లో ఉన్నాయో, ఎటువంటి ఫలితాలనిస్తున్నాయో తెలుస్తాయి. తండ్రి పెట్టిన పరీక్షకు ప్రహ్లాదుడిచ్చిన సమాధానం జగత్ప్రసిద్ధం

" చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులు; నేఁ
జదివినవి గలవు పెక్కులు ;
చదువులలో మర్మమెల్లఁ జదివితి తండ్రీ ! "
(భాగ-7-166)

ప్రహ్లాదుడు చదవటంలో ఒక విశేషం ఉంది : చదువులన్నీ చదివాడు, వాటిలోని మర్మం కూడా చదివాడు. విషయ విజ్ఞానానికి సంబంధించిన చదువులనేకం చదివి వస్తుజ్ఞానం సంపాదించాడు. దానితోపాటు అది జీవితానికిచ్చే అనుభవ జ్ఞానం - లేదా - తత్త్వజ్ఞానం కూడా సాధించాడు. అంటే విద్యను జ్ఞానంగా, శీలంగా కూడా మార్చుకొన్నాడన్నమాట.

హిరణ్యకశిపుడు తన కొడుకు ఎంత వస్తు విజ్ఞానం నేర్చుకున్నాడో పరీక్షింప దలచాడే కాని, అతనికెంత ఉత్తమశీలం అలవడిందో పరీక్షించదలచలేదు. విద్య మేధను పండించటమే కాదు; మానవ వ్యక్తిత్వాన్ని వికసింపచేయాలి. ప్రభుత్వం విషయ పరిజ్ఞానాన్ని పరీక్షించి మార్కులిస్తుంది. ఆ మార్కులను ర్యాంకులను చూచి విద్యార్థుల యోగ్యతను నిర్ణయిస్తారు. విద్యావిధానం పరీక్షలూ - ఫలితాలూ విజయవంతంగా సాగేటట్లు చూడటం మీదనే ఆధారపడి ఉంది. ఈ పరిస్థితుల్లో అధ్యాపకుడు విద్యాబోధనం సక్రమంగా సాగించటం కత్తిమీద సాములాగా ఉండటంలో ఆశ్చర్యం లేదు.

" A good student is not merely one who has read much, but who has been taught well. He learns more from teachers than from books" - అని అన్నారు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు. పఠించే పుస్తకాల కంటే, పాఠం చెప్పే ఉపాధ్యాయుడే విద్యార్థి వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తాడు. అయితే, విద్యార్థులు ఒక గురువుమీదే ఆధారపడి ఉంటారా ? అనే ప్రశ్న ఉదయించవచ్చు పరంపరగా వచ్చే ఈ శ్లోకం ఒక సమాధానం చెపుతున్నది.

" ఆచార్యాత్ పాద మాధత్తే
శిష్యం పాదం స్వమేధయా
పాదం సబ్రహ్మచారిభ్యో
పాదం కాలక్రమేణ తు "

( 12 వ పేజీ తరువాయి )

ఆంగ్లేయులకు బందీ కాకూడదు అని నిశ్చయించుకొని తన దగ్గర ఉన్న తుపాకీతో తానే కాల్చుకొని వీరోచితంగా మరణించాడు.

19 సం॥ చిరుత ప్రాయుడైన ఖుదీరాంకి జిల్లా మేజిస్ట్రేట్ మరణశిక్ష విధించాడు మృత్యుముఖంలో కూడా చిరునవ్వును చిందించాడు ఖుదీరాం హైకోర్టు న్యాయమూర్తి కూడా క్రింది కోర్టు వేసిన మరణశిక్షను ధృవీకరించి, 1908 ఆగస్టు 6వ తేదీకి బదులు 19 తేదీకి శిక్ష అమలును వాయిదా వేశాడు "నీవు చెప్పుకోవలసినది ఏమైనా ఉన్నదా" అని హైకోర్టు న్యాయమూర్తి అడిగిన ప్రశ్నకు ఖుదీరాంబోస్ 'సాహసవంతులు అయిన రాజపుత్రస్త్రీలవలె నేను కూడా నా దేశ స్వాతంత్ర్యం కొరకు మరణించాలి అని అనుకుంటున్నాను. మరణానికి నేను భయపడటం లేదు కాని క్రూరుడైన కింగ్స్

( 8 వ పేజీ తరువాయి )

ఈ శరీరమునకు 67 సం॥లు ఎప్పుడైనా, ఎవరినైనా నేను చేయి చాపి అడగలేదు. కారణమేమిటి ? భారత దేశమునందే కాదు ఏ దేశమునందైనా కూడనూ

విద్యార్థులు విద్యలో నాల్గవభాగం ఆచార్యుల వలన మరొక నాల్గవవంతు సొంత తెలివితేటలవలనా, మరొక నాల్గవభాగం తోటి విద్యార్థుల వలన, మిగిలిన నాల్గవ భాగం కాలక్రమేణ జీవితానుభవం వలన నేర్చుకుంటారని ఈ శ్లోకం తాత్పర్యం అంటే, విద్య ఫలవంతం కావాలంటే అధ్యాపకుడూ, విద్యార్థీ, పరిసరాలూ, జీవన విధానం వాటి వాటి పాత్రలను సక్రమంగా నిర్వహించాలన్నమాట ! అధ్యాపకుడు విద్యను ఎంత బాగా బోధించినా, విద్యార్థికి మొదట తగినంత మేధాశక్తి లేకపోయినా, ఆ తరువాత చదువుకోటానికి అనుకూలమైన వాతావరణం, సాహచర్యం చుట్టూ లేకపోయినా, సామాజిక పరిస్థితులు అనుకూలించకపోయినా, ఆ పైన, విద్యార్థి చదివిన చదువుకు పోషకంగా ఉండే వనరులు, అవకాశాలు కల్పింపబడకపోయినా, బోధించిన చదువంతా బూడిదతో పోసిన పన్నీరై పోతుందన్నమాట.

ఫోర్డుకు తగినశాస్తి చేయలేనందుకు చింతిస్తున్నాను" అని నిర్భయంగా చెప్పాడు ఖుదీరాం చరిత్రలో అమరునిగా మిగులటమే గాక తన త్యాగంతో ఎంతో మంది యువకులను ఉత్తేజితుల్ని చేశాడు కింగ్స్‌ఫోర్డ్ ఉద్యోగం వదలి పారిపోగా ఆంగ్లేయులు భారతదేశం వదలిపెట్టవలసివచ్చింది ఖుదీరాంబోస్ 1889 స॥ డిశంబర్ 3 వ తేదీన మేదినిపూర్ జిల్లాలలో 'బహలవైయని' అనే కుగ్రామంలో త్రైలోక్యనాథ్ బోసు, లక్ష్మిప్రియా దేవి దంపతులకు జన్మించినాడు. తల్లిపాలతోనే దేశభక్తిని, ఉగ్గుపాలుగా త్రాగిన ఖుదీరాం అతి పిన్న వయస్సులోనే అనేక త్యాగాలు చేసి దేశ స్వాతంత్ర్యసాధన కొరకు ప్రాణత్యాగం చేసిన చిరస్మరణీయుడు హింస, దౌర్జన్యం, విధ్వంసము వలన అంతిమ విజయం సాధించలేకపోయినా, బ్రిటీష్ వారికి భయభ్రాంతులు కల్పించిన విప్లవవీరుల చరిత్రలు మరువలేనివి.

పవిత్రమైన కార్యములు చేయాలనుకుంటే ఎవ్వరినీ యాచించనక్కర్లేదు. మన పవిత్రతే దానిని తెప్పిస్తుంది చేసే వ్యక్తులు లేకపోతున్నారే కాని నిజంగా చేసే వ్యక్తులే ఉంటే డబ్బుకు ఏమాత్రం

కొదవలేదు. కనుక మేము ఒక్క నయాపైసా కూడనూ మేము దుర్వినియోగం చేయడం లేదు. ఏ సీ ఎవరైనా Draw చేస్తున్నారా? అవి అనుకోవడానికి పట్టి అవకాశములే లేవు మా ట్రస్టులో. ప్రతి దానికి కూడనూ ఇద్దరు సంతకాలు చేయాలి. ప్రతి చెక్ మీద కూడనూ నా సంతకం లేకుండా ఎవరూ పెట్టడానికి వీలు లేదు. ఇంక ఎంతో Cash కొన్ని కోట్లు వచ్చింది అంతా తినేశారు అంటున్నారు. చాలా శుద్ధ అబద్ధం. Cash అనేది మేము ముట్టటమే లేదు. ఏవరైనా అంతో ఇంతో ఇస్తున్నాము అంటే వారింటికి Bank manager ని పిలిపించి, సెంట్రల్ ట్రస్టువారు, బ్యాంక్ మేనేజర్ ఇచ్చేవారు ముగ్గురి సమక్షంలోనే ఆ డబ్బును బ్యాంక్‌కు తీసుకెళ్ళుతున్నారు. ఈ విషయంలో ఎవ్వరూ వేలు చూపడానికే వీలులేదు. అలాంటి పరిస్థితులలోపల Central trust వారిమీద అభాండములు వేసి ప్రచారం చేయటం ఇది మహా పాపం. జగత్తులో ఎక్కడ విచారించినప్పటికీ ఇలాంటి పవిత్రముగా వినియోగం జరగడం అనేది ఎక్కడ కూడా లేదు. కనుకనే మా సంస్థ దినదినాభివృద్ధి పొందుతూ ఉన్నది. ఇప్పుడే కాదు. సూర్య చంద్రాదులుండినంతవరకూ కూడనూ మా సంస్థకేమాత్రమూ ధోకా లేదు. ఇది కేవలమూ అసూయాపరులచేత కల్గించేటటువంటి యొక్క అసంతృప్తే. ప్రశాంతంగా ఉండినటువంటి ఈ ప్రశాంతి వాతావరణమునకు అపకారం చేస్తున్నారు. ఐతే ఇది మంచిది కాదు. ఎందుకు ఇంతకాలము స్వామి జవాబివ్వ లేదు అవి ఊహించవచ్చు. ప్రతి దానికి ఒక సమయం రావాలి. కౌరవులు పాండవులను అనేక విధములు అవమానపరుస్తూవచ్చారు, బాధిస్తూవచ్చారు, హింస చేస్తూవచ్చారు. పాండవులందుండినటువంటి ఏ శక్తులు కౌరవులకు తెలుసు. ఒక్కొక్కరియందును కూడనూ ఎంతో ఘనమైన శక్తులు ఉంటున్నాయి గాని వారు ఏమాత్రమూ ఆ శక్తులను ఉపయోగపెట్టలేదు. మౌనం వహిస్తూవచ్చారు. ఈ మౌనాన్ని కౌరవులు పిరికితనంగా భావించారు. ఇది కేవలము ఒక బలహీనంగా భావించారు కాదు. సహనంలో ఉండిన ఎంతటి మహత్తరమైన శక్తి ఎవ్వరూ గుర్తించరు. కనుకనే సత్యసాయి ట్రస్టు సహనాన్ని పాటిస్తూవచ్చింది. ఈ సహనంలో ఉండినటువంటి శక్తి ఇట్టిది, అట్టిది అని ఎవరూ వర్ణించడానికి వీలుకాదు. ఈ సహనమే సర్వము "క్షమ సత్యము, క్షమ, ధర్మము, క్షమ వరము క్షమ అహింస, క్షమ సర్వస్వము" ఈ క్షమలో ఉండినటువంటి శక్తి ఎవ్వరునూ గుర్తించడానికి వీలుకాదు.

ఇంక మా విద్యార్థుల యొక్క విషయము. మా విద్యార్థులు ఎవరితో పోల్చుకున్నప్పటికీ ఈ మా విద్యార్థులవంటి విద్యార్థులు చిక్కనే చిక్కరు. ఈనాటికి 28 దినములు అయినది ఈ సంఘటన జరిగి. నిత్యమూ కూడనూ మా విద్యార్థులు పారాయణ చేయటం, ఉపవాసాలు చేయటం, మాకు వచ్చిన ఈ చెడ్డపేరును మేము ఏరీతిగా పోగొట్టుకోవాలి? అనేటటువంటి పరితాపముతో వారు రాత్రింబవళ్ళు అన్నపానాదులు మాని తపిస్తున్నారు, భజిస్తున్నారు. ఏదో బస్తా బియ్యం లోపల కొన్ని మెరికలు లేకుండా ఉంటాయా? కనుక కొంతమంది లోపల ఒకరో ఇద్దరో ఉంటుంటారు. ఆ ఒకరిద్దరి కోసమని సత్యసాయి విద్యా సంస్థలలోని విద్యార్థులు ఇలాంటివారూ అని చాటటం ఇది మహా పాపం. మా విద్యార్థులు చక్కని బంగారం వంటివారు. స్వామి కోసం ఏమైనా చేయడానికి సిద్ధంగా ఉన్నారు. మీరు విన్నారు ప్రారంభంలో ఒక పాట పాడాడు చిన్న పిల్లవాడు, మా ప్రాణాలంతా మీకు అర్పితము చేస్తున్నామని పాడాడు. ఎవరో ఒకరిద్దరు చేసిన దోషానికి అందరిపైనా ఈ క్షమైనటువంటి అపరాధము వేయడం మంచిది కాదు. ఇది ఎట్లా ఉన్నప్పటికీ కొంతకాలము విద్యార్థులు గాడనూ దీనిని భరించుకోవాలి. సహనం వహించాలి. రాత్రి మనం పరుండినపుడు ఒకటో రెండో దోమలు మనలను కుట్టాయి. రెండో దినము మనం ఫ్లిట్ కొడతాము. కాని కుట్టే దోమలు రెండైతే, చచ్చే దోమలు యింకా

ఎక్కువవుతాయి. కారణం ఏమిటి? ఆ కుట్టిన దోమలతో స్నేహం (Friendship) చేయడం చేతనే ఇవి కూడనూ చావుకు గురియైపోతున్నాయి. కనుక దుష్టులు, దుర్మార్గుల యొక్క సహవాసం చేతనే మనకు కూడనూ ఆ విధమయిన పేరు రావచ్చు. కనుకనే దుర్జనునికి దూరంగా ఉండాలన్నారు సత్సంగంలో చేరాలి. అప్పుడప్పుడూ వస్తుంటాయి ఇలాంటి నిందలు.

ఇది కేవలం అసూయ అనే చిమ్మటలు మసిగుడ్డను కొడుతుంటాయి, బెనారస్ చీరను కొడుతుంటాయి విలువైన వస్త్రాలను కొడుతుంటాయి. పనికిరాని వస్త్రాలను కొడుతుంటాయి. ఇది వాటి యొక్క స్వభావం. మంచిచెడ్డ అనేది వాటికుండదు కనుకనే మంచివారు ఓపిక పట్టుకోవాలి. అప్పుడే మనము విజయమును సాధిస్తాము కనుక జరిగినటువంటి విషయాలు కావి, దేనికి కాని మనం విచారణ చేయ కూడదు జరుగవల్సినవి జరుగుతూ వుంటాయి. ప్రపంచంలో ఏ విధంగా జరగాలో ఆ విధంగా జరుగుతూ ఉంటాయి

ఒక చిన్న విషయం ఇంతవరకూ నేనెవ్వరికీ చెప్పలేదు చాలామంది భక్తులు ఈ విధంగా జరుగు తుంది కదా! స్వామి! రాధాకృష్ణకు ఎందుకు చెప్ప కూడదు? ఎందుకు ప్రతికించకూడదు? అని ప్రశ్న లేస్తూంటారు. అయితే ఇది ఆధ్యాత్మిక మార్గములో నేను చెబుతున్నాను లౌకికమైన విషయంలో కాదు. ఇరువురం ఏడు గంటలకే భోజనం చేశాము. క్రింద కూర్చున్నాడు రాధాకృష్ణ. "రాధాకృష్ణ పైకి పోదాం రా! ఇక్కడ కూర్చోవద్దు అన్నాను" స్వామి! నేను ఇప్పుడక్కడికి వస్తే, 7 గంటలకే నిద్రరాదు" అన్నాడు. "ఇంత రాత్రి ఇక్కడ కూర్చుని ఏమి చేస్తావో అదే నీ రూంలో కూర్చుని చేయి నిద్ర పొమ్మని చెప్పను, నీవు తక్షణం బయల్దేరు రా! రా!" అని చాలా తొందరపెట్టాను. అదే చూడండి మరణం అనేది ఏ విధంగా చెప్పినా కూడనూ అది నెట్టుకొని వస్తుంది. కట్టకడపటికి నేను కోపంగా చెప్పాను. "నీ దురదృష్టము, నీ మూర్ఖత్వము" అని నేను చాలా కోపంగా చెప్పాను మాట్లాడినట్లు నటన చేశాను, తను కొంచెం కష్టపడ్డాడు. "నేను వెళ్ళాను పైకి వచ్చేసేయ మని చెప్పి, తాను చక్కగా విచారించాడు తనకు బాగా తెలుసు ఇరవై రెండు సం॥ల నాడు స్వామి ఏమి చెప్పినా మన మంచికోసమే చెప్తారు అనుకొని తిరిగి వంట రూంలోనికి వెళ్ళాడు మజ్జిగ కలుపుకొని ఒక టంబ్లర్ తీసుకొనివచ్చాడు నవ్వుతూ నవ్వుతూ వచ్చాడు "స్వామీ! నాపైన మీరు కోప్పడ్డారు ఈ మజ్జిగ కొంచెం త్రాగి చల్లార్చుకోండి" అన్నాడు "రాధాకృష్ణా! నాకు కోపం కాదు, నీ మంచి కోసం చెప్పాను." అనేటప్పటికి రాధాకృష్ణ అన్నాడు "లేదు నేను ఎవరితోనో మాట్లాడతానని, ఎక్కడికో పోతానని స్వామికి 'దౌటు'" అన్నాడు. "అంత దౌటుంటే నిన్ను నా దగ్గర పెట్టుకుంటానా! ఇది దౌటు కాదు నీ మంచి కోసం చెప్తున్నాను సరే నేను చెప్పాను. నేను ఎప్పుడూ రాత్రిపూట మజ్జిగ తాగనే, ఎప్పుడూ తాగ లేదే. ఈనాడు ఎందుకు యిలా కొత్తగా మజ్జిగ తీసుకువచ్చావు?"అని అన్నాను. "నా మనసులో అన్పిం చింది స్వామికీనాడు మజ్జిగ ఇవ్వాలని, తెచ్చాను అన్నాడు. "సరే నీ మనసులో అన్పించింది మంచిదే ఐతే, నీ మాట ప్రకారం నేను తీసుకుంటాను. 'నేను క్రిందకి పోయి మజ్జిగ టంబ్లర్ క్రిందపెట్టి మళ్ళీ పైకి వస్తాను' అని మాట ఇస్తే తీసుకుంటాను" అన్నాను. చెప్పాడు. తప్పక నేను వస్తానన్నాడు నేనెప్పుడూ మజ్జిగ త్రాగను. కొంచెం తీసుకొని "ఇంక చాలు నీ తృప్తి కోసమని నేను తీసుకొన్నాను"అని అన్నాను. తీసుకున్నాడు పరిశుద్ధమైన హృదయం. "స్వామీ! ఈ మిగిలిన మజ్జిగ నేను త్రాగచ్చునా?" అన్నాడు 'తీసికెళ్ళ దానికి ఎందుకు పారబోస్తావు నీవే తీసుకో' అన్నాను. అక్కడే ఎత్తుకొని త్రాగాడు. "పో, ఇంక టంబ్లర్ క్రిందపెట్టి పైకి వచ్చేసేయి" అన్నాను. క్రిందకి

# ఆంధ్రప్రదేశ్‌లో...

# చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధికి ...

* వినోదపు పన్ను రాయితీ......
* పూర్తిగా రాష్ట్రంలో నిర్మించే చిత్రాలకు 5 పర్సెంటేజి పాయింట్లు ......
* అందులో తక్కువ బడ్జెట్ చిత్రాలకు తిరిగి 50 శాతం వరకు వినోదపు పన్నులో రాయితీ ......
* రాష్ట్రంలో నిర్మించే తెలుగు చిత్రాలలో అశ్లీలానికి, హింసకు ప్రాధాన్యం లేకుండా వున్న చిత్రాలకు ఒక్కొక్కరికి మూడు లక్షల రూపాయల వరకు సబ్సిడీ ....
* సబ్సిడీ చెల్లింపులకై మూడుకోట్ల రూపాయల విడుదల
* తెలుగు చిత్రసీమలోని కళాకారులు, సాంకేతిక నిపుణులు, అల్పాదాయ వర్గాల వారికి స్వల్ప కాలిక పద్ధతిపై గృహ వసతి కల్పన ...
* రాష్ట్రేతర ప్రాంతాలలో నివసించే తెలుగు వారి కొరకు తెలుగు చలన చిత్రోత్సవాల నిర్వహణ .... ....
* సినిమా థియేటర్ల నిర్మాణానికి దీర్ఘ కాలిక ఋణాల మంజూరు .... —
* చలన చిత్ర నిర్మాణ వ్యవస్థా కల్పనకై అదనంగా మూడు కోట్ల 45 లక్షల రూపాయల విడుదల ............
* ప్రభుత్వం అమలుపరుస్తున్న అభివృద్ధి కార్యక్రమాల ప్రచారానికి డాక్యుమెంటరీ న్యూస్ రీళ్ల నిర్మాణం .........

మీ కోసం .........

మీ సేవలో........ ....




**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధిసంస్థ**

10-2-1, ఎ. సి. గార్డ్స్

హైదరాబాద్ – 500 028

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్

పోయాడు. మాట ఇచ్చాడు. కాని క్రింద ఉంచే స్వామి తిరిగి పిలుస్తారేమోనని, యీ యువకులకంతా కూడా యిదే ఒక పెద్ద మూర్ఖత్వము. చెప్పినది వినరు. ఆ చెప్పినది వింటూ వస్తే, ఎవరికీ ఏ ప్రమాదాలూ ఉండవు. తిరిగి క్రింద ఉంచే మళ్ళీ పిలుస్తారనే ఉద్దేశ్యంతో, ఆ మజ్జిగ టంబ్లర్ క్రిందపెట్టాడు. Sister యింటికి వెళ్ళాడు. వాళ్ళ Sister కూడా యిక్కడే ఉంటుంది వాళ్ళింటికి వెళ్ళాడు. ఆ వెళ్ళి ఆ యొక్క యమదూత 10 గం॥లకు లాక్కొని వచ్చింది. ఇది ఈవిధంగా జరిగింది. నేను మంచికోసం చెబుతున్నాను కానీ, చెడ్డ ఎవరికీ చెప్పను. ఏది చెప్పినా పవిత్రమే కాని, అపవిత్రం కానే కాదు మీరు నమ్మిన నమ్మకపోయినా నేను నిరంతరం యోచిస్తున్నాను. ప్రజలకు ఏది మంచిపని చేయాలి? ఈ బీదవారికి ఏ విధంగా అనుకూలంగా చేయాలి ? ఈ విధమైనటువంటి యోచనలేగాని, నా చింత నేనెప్పుడూ చేయలేదు. మన Summer Classes అయిన తర్వాత ఇందూ లాల్‌షా, శ్రీనివాస్ వీళ్ళందరూ యీ మూడు సం॥లు అనగా 70వ సం॥ లోపల ఏవేవి ఒక్కొక్క సం॥ లోపల చేయాలి అని Plan వేసుకుంటూ వచ్చారు. నేను చెప్పాను. నా కోసం ఏమి పనులు చేయవద్దు అని, ప్రజల కోసం, సమాజం కోసం, బీదవారి కోసం, లోకం కోసం ఏమైనా చేయండి, నాకు సంతోషమే. అని నేను శ్రీనివాసన్‌ను పిల్చి చెప్పాను. "నాకు నాలుగు కోరికలున్నాయి నా కోసం కాదు. చెప్పాను, యీ ప్రపంచంలో యీనాడు వర్షాలు సరియైన పరిస్థితులలో లేకపోవడంచేత మధ్యతరగతి భూములుండే రైతులు చాలా అవస్థలు పడుతున్నారు, 5, 6 ఎకరములుండిన వారికి ఏమాత్రము పండించుకొని, జీవితాన్ని సుఖంగా గడుపుకొనడానికి ఏమాత్రమూ అవకాశములేదు. ఈ Labour యొక్క కూలీలు చాలా పెరిగిపోయినాయి. ఈయొక్క కూలీలు భరించుకొని వారు పంట పండించుకొనలేకుండా ఉంటున్నారు పొలాలను దున్ని దుక్కి చేయడానికి తగినన్ని పశువులుకూడా లేకపోతున్నాయి. కాబట్టి యీ 70 సం॥నకు 70 ట్రాక్టర్స్ తెచ్చి బీద రైతులకు ఉచితంగా యివ్వాలి. అని చెప్పాను. నా యొక్క మాట, నాయొక్క పని రెండూ ఒక్కతూరిగా జరుగుతాయి. ఒక తూరి చెప్పటం, ఒక తూరి చేయటమూ కాదు తుపాకి కొడితే శబ్దము ఏటు ఒక్కతూరిగా జరగాలి. తక్షణమే ట్రాక్టర్ల కంపెనీలకు ఫోన్‌చేసి ఆర్డర్లు యిచ్చినాము.

మరొకటి స్వామి ఉద్దేశ్యము ఏమిటని అడిగాడు శ్రీనివాస్. ఇక్కడ ఉన్న యువకులు పనులు లేక బజారులలో తిరుగుతూవున్నారు. వీరికి ఏదైనా పని పెట్టాలి మనం సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ కట్టాము. అది చాలా దూరంగా ఉన్నది. Post office గూడనూ దూరంగా ఉన్నది చాలామంది రెండింటికి పోవాలంటే శ్రమపడుతున్నారు. కనుక వారికి జీవితము జరుగుతుంది, మనకూ అనుకూలము జరుగుతుందని డెబ్బైమందికి ఆటోరిక్షాలిచ్చివేయాలి అన్నాను. ఈ బీద వారికి జీవితాధారం చేయడం సంతోషం అన్నాను వాటికి కూడనూ Order ఇచ్చినారు ఇక మూడోవది చాలా మంది మంచి కుటుంబంలో పుట్టి శిథిలమైనటువంటివారు కూలికి పోలేనటువంటివారు, ఆహారం జరగనటువంటి వారు, ఎంతోమంది ఉంటున్నారుఆడవాళ్లు. అలాంటి వారికి ఏదన్నా కుట్టుపని కల్పించి, ఒక్కొక్కరికి ఒక్కొక్క కుట్టుమిషన్ ఇచ్చేసి వారు జీవితం గడుపుకొనడానికి తగినటువంటి మార్గాన్ని చూపించాలి అన్నాను. 70 కుట్టుమిషన్లకు కూడా వెంటనే ఆర్డరు యివ్వటమైనది. ఇంక నాల్గోది 70 మంది బీదవారికి ఏ కులమువారు కానీ, ఏ మతము వారు కాని, ఎవరైనాసరే పెం... చేయాలి సామాన్యంగా పెండ్లి చేయడం కాదు వారి జీవితంలో అనుభవించలేనటువంటి ఆనందాన్ని అందించాలి కళ్యాణమనగా అది చాలా ఆనందమైనదిగా రూపొందింపచేయాలి మంగళసూత్రము, గుడ్డలు మాత్రము ఇస్తే కాదు, మంగళసూత్రంలో వేసుకోవడానికి బంగారం గొలుసు కూడా యివ్వాలి. ఇవ్వటమే

## శ్రీవాణి జీవిత సభ్యులు



**D. S. R. K. Rao**
A. C. S. O.
Sub-Collector's Office
Jaya nagar, JEYPORE (P. O.)
Koraput Dist. (Orissa) 764 001

కాకుండా వారు గృహస్థధర్మము లోపల సరియైన ఆదర్శాన్ని అందించే నిమిత్తమై ఒక్కొక్కరికి ఒక్కొక్క ఇల్లు కూడా కట్టించి యివ్వాలి. ఈ విధంగా Plan చేసినాం. ఏమి చేసినా కూడనూ నా సంకల్పం పరోపకారం ! పరోపకారం ! ఏ ప్రభుత్వమైనా, ఏ ధనవంతుడైనా ఎవరైనా చేస్తున్నారా చెప్పండి ? ఎవ్వరూ చేయటం లేదు ఇంత పవిత్రమైన కార్యాలు చేస్తుంటుంటే దీనిపైనా అసూయ. ఇది కేవలం వారి పాపఫలమే తాము చేయరు. చేసే వారిని చేయనివ్వరు. ఇది కాదు మానవుని యొక్క గుణము. మానవత్వంలో పవిత్రమైన విశాలమయినటువంటి భావములు రావాలి ఇక్కడికి వచ్చి చూస్తే కాని ఈ సత్యము గుర్తించడానికి వీలవుతుంది. కాని "అసూయ" అనే మాలిన్యాన్ని హృదయంలో నింపుకొని ఎక్కడెక్కడో కూర్చొని, ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతుంటే ఇది కేవలం ఒక రాక్షసకృత్యమే కాని మానవ కృత్యము కాదు. ఇలాంటిది ప్రపంచంలో ఎక్కడ కూడనూ జరగటం లేదు ఒక భారతదేశం నందే కాదు ఏ దేశము పోయి అయినా చూడండి Free Education (ఉచిత విద్య) ఎక్కడైనా ఇస్తున్నారా ? ఒక పిల్లవాడిని L K G లో చేర్పించాలనుకుంటే ఒక ఇరవైవేలైనా ముడుపు చెల్లించాలి ఇక్కడ అట్లా కాదు K G లో చేరినటువంటి పిల్లలకు P G. వరకు free. ఇక heart జబ్బులు చేస్తే బయట నాల్గు లక్షలో ఐదు లక్షలో కడితే గాని Hospital లో admit చేసుకోరు. కాని మా Hospital లో అందరికి free. మా hospital లోపల నెలకు ఒక కోటి రూపాయలు ఖర్చు అవుతుంది ఏ ప్రభుత్వం చేస్తున్నది ? ఏ ధనవంతుడు జేస్తున్నాడు ? ఏ శ్రీమంతుడు చేస్తున్నాడు? చేస్తున్నారు పదిలక్షలు ఖర్చుపెట్టి హాస్పిటల్ కట్టించేసి 10 కోట్లు లాభాలు రావాలని చేస్తున్నారు మేము పది నయాపైసలు కూడా కావాలని ఆశించడం లేదు. ఇక్కడ ఆ బిజినెస్‌కే అవకాశం లేదు. అలాంటి దివ్యమైనటువంటి, పవిత్రమైనటువంటి భావాన్ని ఈ విధంగా మార్చడానికి ప్రయత్నం చేయడం మంచిదికాదు.

సాయి యొక్క హృదయము విశాలమైనటువంటిది, ఆకాశము వంటిది. ఆకాశమైనా ఇంకా కొద్దిగా చిన్నదిగా ఉండవచ్చునేమో కానీ, సాయి హృదయం ఇంకా ఆకాశం కంటే అధికంగా ఉంటుంది. యింక సాయి ఎవరి చేతిలోనో బంధితుడైనాడని అనటం, నిజమే. నేను బంధితుడనే, భక్తుల లోపల బంధింపబడ్డాను. దుష్టుల లోపల బంధింపబడ్డాను నా ఉద్దేశ్యం ఏమిటంటే భక్తులకంటే దుష్టులే చాలా ప్రీతి భక్తులు ఎప్పుడో వేరేవేరే మార్గములలో తల్చుకుంటూ ఉంటారు. దుష్టులు 24 గం॥లు తల్చుకుంటుంటారు. కాబట్టి వారి హృదయం లోనూ ఉన్నాను. వీరి హృదయంలోనూ ఉన్నాను. కనుక నేను ఒకరి హస్తములో చిక్కేటటువంటివాడ్ని

కాదు. ప్రతి విషయమునందు కూడనూ ఏ యొక్క సంకల్పము వచ్చినప్పటికీ ఒక ఉత్తమమైనటువంటి ఆదర్శవంతమైన సంకల్పములే,మీరు అనుకోవచ్చు. స్వామి యొక్క ప్రాణము స్వామి చేతిలోనే ఉందికాని మరొకరి చేతిలో లేదు. అనుకుంటే ఎంతకాలమయినా ఉండవచ్చును. లేకపోతే ఎప్పుడైనా దేహాన్ని వదల వచ్చు. ఇది నా యిష్టము కాని, మరొకరి యిష్టము కాదు కారణమేమనగా దీనికి పవిత్రమే సాక్షి. స్వార్థ రహితమే సాక్షి, దీనికి దివ్యత్వమే సాక్షి, ఇంతకంటే సాక్ష్యము మరొకటి ఏమి కావాలి? కనుక ఎవరైనాసరే పవిత్ర హృదయుల ప్రాణాలు వారిలోనే ఉంటాయికాని మరొకరి చేతిలో ఉండవు..

దివ్యాత్మస్వరూపులారా!

ముఖ్యంగా ఈనాడు గురుపూర్ణిమ. గురుత్వమనగా ఏమిటి? సత్యమే జగత్తుకంతా గురుత్వము. నిశ్చలమయిన భావముతో, నిస్వార్థమయిన హృదయంతో సత్యాన్ని పాటించండి. ఆ సత్యమే మీకు రక్ష ఆ సత్యమే మీకు కవచం, ఆ సత్యమే మీకన్నివిధములైన తోడు "సత్యమ్ నాస్తి పరోధర్మః" "ధర్మో రక్షతి రక్షితః" ధర్మాన్ని మీరు రక్షిస్తే, ఆ ధర్మమే మిమ్మల్ని రక్షిస్తుంది. కనుక ఈ విధమైనటువంటి అదుర్లకు, బెదుర్లకు మీరు ఏ మాత్రం క్రుంగక, త్రుంగక, నెట్టుకొని తట్టుకొని ముందుకు సాగిపోవాలి. మీ సత్యాన్ని లక్ష్యంలో పెట్టుకోండి! మీ పవిత్రమైన హృదయంలో నింపుకోండి! సర్వులనూ ప్రేమించండి! ఎవ్వరినీ ద్వేషించకండి! అప్పుడే సరియైనదివ్యత్వము మీలో ఆవిర్భవిస్తుంది.

(ది 3-7-1993 న ప్రశాంతినిలయంలో భగవాన్ బాబా వారు చేసిన గురుపూర్ణిమ దివ్య సందేశమునుండి)

## త్వరపడం! చందాదారులుగా వెంటనే చేరండి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి జన్మదినోత్సవ సందర్భమున (నవంబర్ '93) వెలువడు శ్రీవాణి మాస పత్రికతో "శ్రీ సత్యసాయి శతకము" (ప్రథమ భాగము) పుస్తకము ఉచితంగా చందాదారులందరికీ పంపదలచినాము. ఈ పుస్తకము చందాదారులకు మాత్రమే ఉచితంగా పంపబడును విడిగా అమ్మబడవు. స్వామి అప్పుడప్పుడు ప్రవచించిన అమూల్యమైన పద్యాలకు వ్యాఖ్యతో పుస్తకము తయారవుతున్నది. కనుక క్రొత్తగా చందా దారులుగా చేరి ఈ సదవకాశమును వినియోగించుకో ప్రార్థన. చందాలు బకాయిలు ఉన్న వారికి ఈ పుస్తకం పంపబడదు. కనుక వెంటనే తమ తమ చందాలను రెన్యూవలు చేసి ఈ అమూల్యమైన పుస్తకమును స్వంతం చేసుకో ప్రార్థన వెంటనే చందాలు పంపినవారికి మాత్రమే ఈ అమూల్యమైన పుస్తకం పంపబడుతుంది. త్వరపడండి!

— సం.

నిత్య జీవితంలో ఆధ్యాత్మిక దృష్టి – 15

# బంధాలా - అనుబంధాలా

పాతూరి ప్రసన్నం

మాతా నాస్తి పితా నాస్తి । నాస్తి బంధు సహోదరః
జాయా నాస్తి గృహం నాస్తి । తస్మాత్ జాగ్రత జాగ్రతః ॥

"తల్లిలేదు, తండ్రి లేదు, బంధువులు లేరు, సోదరులు లేరు, భార్య లేదు, యిల్లు లేదు, జాగ్రత్త నాయనా!"

ఈ రీతిగా మనకు అప్పుడప్పుడు వినిపించే మాటలను విని, అవి యదార్థమే అని భావించి, దానికి తగినట్లుగా ప్రవర్తించే ప్రమాదం మనకు ఏర్పడవచ్చు. అది చాలా శోచనీయమైన దుస్థితికి దారి తీస్తుంది. దురదృష్ట వశాత్తూ తాత్త్వికదృష్టి అంటే పై విధంగా అందర్నీ వదలుకోవటం అనీ, వదలుకొనక పోయినా, ఉపేక్షించి ఎవరికి ఏమి జరిగినా ఉదాసీనంగా బ్రతకటం అనికూడా వ్యాఖ్యానించేవారున్నారు. అది తాత్త్వికదృష్టి కాదు, తామసిక దృష్టి. తామసికుడు కూడా త్రాగి "నాకెవ్వరూ అక్కరలేదు పోండి" అంటాడు. దురభ్యాసాల పాలై పోయి భార్యాబిడ్డల్ని, తల్లిదండ్రులనూ, సోదరి సోదరీ మణులను ఉపేక్షించే వ్యక్తికీ, పెడమార్గం పట్టిన వేదాంత ధోరణిలో తన అనుబంధాలను విస్మరించే వ్యక్తికీ తేడా లేదు. ఇరువురూ పొందే దుఃఖం చివరకు ఒక్కటే.

## అనుబంధాల మందిరం

తన కుటుంబంలో గల అనుబంధాలను గూర్చి ప్రతి వ్యక్తీ ఈనాడు పరిశీలించుకోవలసిన అవసరం కలిగింది. కుటుంబంలోని సంబంధ బాంధవ్యాలున్నాయి కానీ మానసికమైన అనుబంధాలే ఈనాడు తగ్గిపోతున్నాయి. ఇది నేటి విచారకరమైన దుస్థితి.

"మా మేనత్త నన్ను పెంచింది. నా యొక్క ఉన్నతికి ఆమెయే కారకురాలు" అనీ "మా పెద్దతండ్రి గారి ఆశీస్సుల చేత యింతవాణ్ణి అయ్యాను" "మా అన్నగారి అనుగ్రహం నన్ను ఇంతటివాణ్ణి చేసింది" అనీ యిలా పూర్వం చెప్పుకొనేవారున్నారు. ఒకరిని ఒకరు యిలా పోషించేవారు. ఒకే కుటుంబంలో గల వ్యక్తులందరిలోనూ అనుబంధాలు అనేవి మానవత్వపు విలువలను పోషించుకొనేటంతటి పవిత్రమైనవిగా, ఉత్తేజకరమైనవిగా, ఉన్నతిని ప్రాప్తింపజేసేవిగానూ వుండేవి. "కుటుంబం" అనేది రక్తసంబంధాలనుంచి ఆత్మతో గల అనుబంధం వరకూ ఒక పోషణస్థానంగా వుండేది. "యిల్లు" అనేది అనుబంధాల లతలు విస్తరించి ప్రేమ సుగంధాలు వెదజల్లే మానవతా ప్రసూనాల పందిరి వంటిది ఆనాడు. ఆ నాటి గృహ జీవనంలో ప్రతి గృహస్థుడూ తన యింటివారికోసం త్యాగంచేసే త్యాగధనుడు. తన సుఖాన్ని, తన ధనాన్ని, తన శక్తినీ తన యింటివారికోసం పరిత్యజించి నిత్య జీవితంలో ఆధ్యాత్మికతకు ఒక జీవిత విధానం సృష్టించారు. భీష్ముడు చేసిన ప్రతిజ్ఞవల్లనే కౌరవ పాండవ వంశాలు ఆవిర్భవించాయి. భరతుడు చేసిన ప్రతిజ్ఞ చేతనే మరల అయోధ్యలో రామరాజ్యానికి అవకాశం కలిగింది. పుత్రునికి వేదాంత బోధలు చేసిన మదాలసవంటి తల్లులూ పర పురుషుని దుర్మధాన్ని శాశ్వతంగా నిర్మూలించటం కొరకు ఘోరమైన ప్రతిజ్ఞలు చేసిన ద్రౌపది వంటి భార్యలూ, రక్షాబంధనాలు చేతికి కట్టి జాతి పౌరుషాన్ని

మేలుకొల్పిన సోదరీమణులూ, యిలా మన సంస్కృతి నిండా, చరిత్రనిండా కనబడుతూ వుంటే తల్లి లేదు, తండ్రి లేదు, అన్న లేదు, చెల్లెలు లేదు అనే వేదాంత ధోరణి గృహస్థుడు అవలంబించవలసిన మార్గం కాదు.

జన్మనిచ్చిన తల్లిలో విశ్వమాతనూ, తనువునిచ్చిన తండ్రిలో జగత్ పితనూ, రక్తాన్ని పంచుకున్న సోదరునిలో, సోదరీమణులలో ఆత్మీయమైన అనుబంధాన్ని అనుభవించటం చేతకాని వ్యక్తికి దైవంతోగల దివ్యానుభూతిని పంచుకోవటం సాధ్యమవుతుందా? తల్లిలో, తండ్రిలో, అతిథిలో, ఆచార్యునిలోనూ దైవాన్ని చూడు, అంటుంది కదా మన సంస్కృతి. దీని అర్థం ఏమిటి? ఈరీతిగా గల మానవ సంబంధాలలో, అనుబంధాలలోనూ దైవం యొక్క స్పృహ లేకపోతే, దైవస్పర్శ లేకపోతే, దైవం మరెక్కడ కనబడతాడు?

కాబట్టి దివ్యత్వానుభూతి మనలో వికసించటంలో యీ అనుబంధాలే సహకరిస్తాయి అని తెలుసుకోవాలి

మధుర వెళ్తే అక్కడ బాలకృష్ణునిపై గల యశోదమ్మ యొక్క మాతృప్రేమను చూడగలగాలి. బృందావనం వెళ్తే అక్కడ బలరామకృష్ణుల సోదరత్వం యొక్క అనుబంధాన్నీ, గోపబాలుర స్నేహానుభూతినీ రుచి చూడాలి. అయోధ్య వెళ్తే అక్కడ కనబడేది అన్నదమ్ముల అన్యోన్యతే. పండరిపురం పోతే అక్కడ చూచేది పుండరీకుని తల్లిదండ్రుల సేవనే. పూరీ జగన్నాథం వెళ్తే అక్కడ కనిపించేది సోదరియైన సుభద్రను తమ సరసన కూర్చుండబెట్టుకొన్న జగన్నాధుని సోదర ప్రేమనే. తీర్థాలకు పోయినా, క్షేత్రాలు చూచినా గుర్తించవలసిన సందేశం యిదే. చూడవలసింది మానవ సంబంధాలలోగల ఈ దివ్యానుబంధాలనే. మానవత్వం యొక్క వికాసంలో యీ పవిత్రమైన అనుబంధాల పాత్ర ఎంతో విశిష్టమైనది

## ఎవరికివారే యమునాతీరే

పైన పేర్కొన్నదంతా గతకాలంయొక్క వైభవాన్ని సూచించేదే. అప్పుడు సమిష్టి కుటుంబాలు వుండేవి కదా! ఈనాటి కుటుంబ వ్యవస్థ సమిష్టి వ్యవస్థ కాదు. ఎవరి కుటుంబం వారిదే. ఎవరి గోల వారిదే. ఎవరి సుఖం వారిదే కనుక పైన వర్ణించినదంతా ఈ రోజులకు సరిపడదు అనుకుంటూ వున్నాం. సమిష్టి కుటుంబాలూ, సమిష్టి బాధ్యతలూ ఈనాడు లేకపోవచ్చు. కనీసం ఒక కుటుంబంలోని వ్యక్తులలోనైనా సామరస్యం, ప్రేమానుబంధం వున్నాయా? లేవు. ఒక పుత్రుడు తల్లిదండ్రులపట్ల చూపించవలసిన గౌరవాన్ని, అభిమానాన్ని చూపించుతున్నాడా? ఇలాగే మన బాంధవ్యాలు ప్రేమతో, అనురాగంతో కూడినట్టివేనా? ఈప్రశ్నలకు సమాధానాలు సంతృప్తికరంగా లభించవు. ఈ వేర్పాటు ధోరణివల్ల మనిషిలోగల 'అహం' మరింత సంకుచితమైపోతుంది. 'నేను' నుంచి 'మనం' లోకి (I to We) పోవటమే ఆధ్యాత్మికత. వికాసమే ఆధ్యాత్మికత. సంకుచితత్వమే ఆధ్యాత్మికత యొక్క రాహిత్యానికి గుర్తు. సంకుచితత్వమే బలహీనత, మరణం.

మనం యితరులకు ప్రేమను పంచితే ప్రేమ మన వైపు యితరులనుంచి కూడా ప్రవహిస్తుంది. మనం స్వార్థచింతన చేత ప్రేమకు బదులుగా స్వార్థాన్నే రుచి చూపితే, యితరులనుంచి కూడా మనకు లభించేది స్వార్థసంకుచితమైన ప్రతిక్రియా ఫలితాలే. జీవితం ప్రతిబింబం. జీవితం ఒక ప్రతిధ్వని. జీవితం ప్రతిక్రియ. (Life is a Reflection, Life is a Resound, Life is a Reaction) కాబట్టి ముందుగా మన కుటుంబంలోనే యీ సూత్రాలకు తగిన ఆచరణ ప్రారంభం కావాలి. "నీ కుటుంబ సభ్యులను ప్రేమించి వారినుంచి ప్రేమను ప్రతిఫలంగా స్వీకరించు. వారిని మృదువైన మాటలతో తృప్తిపరచి, వారినుంచి కూడా అటువంటి పలుకులనే అనుభవించు. వారికి మంచిని చేయి వారి ద్వారా మంచిని పొందు." ఇది ఆధ్యాత్మిక సూత్రాలకు గృహజీవితంలో చేసే సమన్వయం.

ఒక వ్యక్తి వున్నాడు. ప్రతిరోజూ పూజ, గీతా పారాయణంవంటి సాధనలు చేస్తాడు దైవానుగ్రహం

కలగాలని ప్రార్థిస్తాడు. ఇంతవరకూ బాగానే వుంది. కానీ తన తల్లిదండ్రులను వారి స్వగ్రామంలోనే వారి బీదరికంలోనే వుంచాడు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లు ఎవరినీ దగ్గరకు రానివ్వడు. కనీసం పలకరించే హృదయంకూడా లేదు. లోభత్వంతో రక్తబంధువులకు దూరం అయి, డబ్బును మాత్రం పోగుచేసుకున్నాడు. కానీ ఆ డబ్బుతో సుఖం అతనికి లేదు కొడుకులతో దుఃఖం కలిగింది. ఒక్కగానొక్క కుమార్తె, ఒక బిడ్డను కన్నాక అత్తవారి దుష్టత్వాన్ని సహించలేకనో ఏమో, లేక వారే ఆమెను గంగపాలు చేశారో తెలియదు, తల్లితండ్రులకు కనబడకుండా పోయింది ఆ వ్యక్తి జీవితంలో ఉత్తరార్థం అంతా అందరివలనా దుఃఖమయం. మూర్ఖంగా తనవారిని మానసికంగా హింసిస్తే, చివరకు మిగిలేది మానసిక దుఃఖమే.

## బంధాలూ – అనుబంధాలు

తులసీదాసు భార్యను ఎంతో ప్రేమించేవాడు. లోక దృష్టిలో ఈ ప్రేమించటం అంటే భార్య పట్ల గల కోరికే, కామమే. భార్యను విడిచి ఒక్క రాత్రి కూడా వుండలేకపోయేవాడు. ఒక రోజు భార్య పుట్టింట్లో వుండగా, రాత్రికి రాత్రే నదిని ఈది అత్తవారి వూరు చేరాడు మేడమీద పై అంతస్థులో భార్య వున్నది. గోడకు వ్రేలాడే ఒక త్రాచుపామును తాడుగా భ్రమించి దానిని పట్టుకొని పైకి ఎగబ్రాకి వెళ్లాడు. "నాలో ఏం చూచి యిలా ప్రాణాలకు తెగించి వచ్చారు ? రక్త మాంసాలు తప్ప ఈ శరీరంలో ఏమున్నాయి? " అంటూ గుడ్డలు విప్పి భర్త ముందు నిలబడింది తులసీదాసుభార్య. "నా మీద గల ఈ ప్రేమే రామునిపైన వుంటే మీకు శ్రీరామ సాక్షాత్కారం కాదా ? " అన్నది అంతే! తులసీదాసుకు కనువిప్పు కలిగింది. అతని మనస్సు అంతవరకూ కాముని పైనే వుండేది. ఇప్పుడు అది రాముని పైకి మరలింది తులసీదాసు జీవితంలో అదొక అద్భుతమైన మలుపు.

ప్రేమానుబంధాలు తోటి వ్యక్తిలో వికాసాన్ని, ఔన్నత్యాన్ని కలిగించాలి. తన భార్యను తలచుకుంటూ నెపోలియన్ రణరంగం మధ్య తన గుర్రపు జీనుపై కాగితం పెట్టి ప్రేమలేఖలు వ్రాసేవాడు. మహావీరుడైన నెపోలియన్ అలా రణరంగం మధ్య నిలబడి ప్రేమలేఖలు వ్రాస్తూవుంటే అతనికి ప్రక్కగానే తుపాకీగుండ్లు దూసుకుపోయేవి "మనిషి ఒకే ఒకసారి చస్తాడు పిరికితనంతో మనిషి ప్రతిరోజూ చస్తూనే వుంటాడు " అన్నాడు నెపోలియన్.

అటువంటి అనుబంధం ఒక బంధమైతే ?

మీరాబాయి కృష్ణ భక్తిని విడువనన్నది రాణాకు కోపం వచ్చి భార్య అయిన మీరా త్రాగే పాలలో విషం కలిపాడు కృష్ణపరమాత్ముడు మీరా విషపానం చేసినా రక్షించాడు కృష్ణుణ్ని నమ్మిన మీరా మరల రాణా దగ్గరకు పోలేదు. అన్నయైన రావణుడు తన హితవును స్వీకరించనందువల్ల విభీషణుడు సోదరుడనే అనుబంధం నుంచి బయటపడ్డాడు కన్నతల్లి అయిన కైక ఆజ్ఞను మీరి ప్రవర్తించాడు భరతుడు.

"నా భార్య నాతో సహకరించటం లేదు ! నేను ఈ రీతిగా ఆధ్యాత్మిక సాధన చేయటం ఆమెకు ఇష్టం లేదు" అన్నాడు ఒక భక్తుడు రామకృష్ణపరమహంసతో. "నీకుగల భగవత్ ప్రేమ నిజమైనదైతే నీ భార్య మనస్సు మారాలి. నీతో సహకరించాలి" అన్నారు పరమహంస

సంసారంలోని వ్యక్తులలో అనుబంధాలూ, అనురాగాలూ సామరస్య పూరితం కాకపోతే? మనస్సులలో విభేదాలు మొలకెత్తితే ! ఒకరి భావాలను ఒకరు గౌరవించక పోతే ? ఇది అందరినీ పీడించే సమస్యే! ఏమవుతుంది?

"I Agree with your disagreement " అన్నాడు ఒక రచయిత. "నీవు నాతో ఏకీభవించక పోవచ్చు. నీవు నమ్మిన మార్గమే నీకు మంచిది అనిపించితే నీ మార్గాన్నే నీవు ముందుకు సాగిపో. గమ్యం దొరక్కపోతే వెనక్కు వచ్చి, మరల నా మార్గానికే వద్దువుగాని" అనేటంతటి ఔదార్యం మనలో వుండాలి. అప్పుడు బేధాభిప్రాయాలు వుండవచ్చును కానీ, మనస్సులోని ఆత్మీయతలు, అనురాగాలుచెడవు.

మన అనుబంధాలు బాంధవ్యాలుగానూ, స్నేహాలుగానూ రూపొందుతాయి స్నేహితుల్లాంటి బంధువులు, బంధువుల్లాంటి స్నేహితులూ వుంటే ఆ జీవితాలు ఆనంద సింధువులు అనుబంధం ఒక బంధుత్వం రూపంలో వుండవచ్చు కానీ ఈ బంధుత్వం ఎదుటివారికి బరువు కాకూడదు. అదే స్నేహం లాంటి బంధుత్వం అంటే మంచి చెడూ, సుఖం దుఃఖం కలిగినప్పుడు పాలు పంచుకోవటమే స్నేహ ధర్మం "అత్యావసరం వస్తే నా ప్రాణాన్నయినా యిస్తాను" అనే స్నేహం బంధుత్వం వంటి స్నేహం. రక్తసంబంధాలే బంధుత్వాలు అనుకోవటం పొరపాటు. బంధుత్వాలు కానీ, స్నేహాలు కానీ ఆత్మ సంబంధాలు కావటమే అనుబంధాలన్నింటికీ చిట్ట చివరి పరిణామం, ఆత్మానుభవంకోసం వచ్చినవే ఈ అనుబంధాలన్నీ. ప్రతి వ్యక్తిలోనూ గల విజతత్వమైన ఆత్మతత్వంతో అనుబంధం కలిగివుండటమే అందరిలోనూ పరమాత్మను చూడటానికి చెప్పే విర్వచనం.

## ఋణానుబంధాలు

"ఋణానుబంధ రూపేణ, పశుపత్ని సుతాలయః" అన్నారు. మన సంబంధాలన్నీ గత జన్మలో చేసుకొన్న ఋణానుబంధాలే. ఇది పారమార్థిక సత్యం. భార్య, బిడ్డలు, పశువులు, సంపదలూ అన్నీ గత జన్మలో చేసుకొన్న ఋణాలే. మనకు ఈ అనుబంధాల వలన కలిగే సుఖ దుఃఖాలన్నీ కర్మానుసారంగా సంభవించేవే. సందేహంలేదు అటువంటి ఈ ఋణానుబంధ రూపంలోని అనుబంధాలన్నీ కూడా మనకు ఎటువంటి దుఃఖాన్నీ కలిగించనట్టివిగా మలచుకోవటమే ఆధ్యాత్మిక దృష్టిలోని అంతర్యం

అభిమన్యుడు పోయినప్పుడు అర్జునుడు విలపించటం, ఉపపాండవులు హతులైతే పాండవులు వాపోవటం, నలదమయంతులు పడ్డ కష్టాలూ, యివన్నీ మన అనుబంధాల వెనుకగల ఆధ్యాత్మిక సత్యాలను నిరూపించేవే అటువంటి కష్టాలు ఎవ్వరికి కలకాలం వుండవనీ, అలాగే సుఖాలూ శాశ్వతం కావనీ తెలుసుకొని బ్రతుకుతూ, "నా కష్ట సుఖాలకు మీరెవ్వరూ బాధ్యులు కాదు," అనే దృఢచిత్తం పొందగలిగితే మన అనుబంధాలు ఏవీ ప్రతిబంధకాలు, దుఃఖదాయకములూ కావు

రోజులు మారుతున్నాయి మారటం కాలంయొక్క స్వభావం. రోజులనుబట్టి పరిస్థితులూ మారుతూ వుంటాయి. మారే పరిస్థితులకు ఎలా స్పందించాలి? మంచి పరిణామాలయితే పొంగిపోవటం, కలిసిరానివి అయితే కుంగిపోవటం మానవతా లక్షణం కాదు. ముగ్గురు అమ్మాయిలలో ఒక్క అమ్మాయికే వివాహం చేయగలిగాడు: ఇద్దరమ్మాయిలకు వివాహం చేయలేక పోయాడు ఒక గృహస్థుడు పెళ్ళికాని ఆ యిరువురు ఆడపిల్లలూ గుండెమీద రెండు కుంపట్లు, అంటూ తల్లి తల్లడిల్లిపోవటం ఎంత అవివేకం? "నీకు పెళ్ళికాలేదు. నీవు దురదృష్టవంతురాలివి" అంటూ వారిని నిందించటం అదేదో వారి గతజన్మ పాపఫలమని వారిని మానసికంగా కృంగదీయటం చాలా అవివేకం. వారికి చదువులు చెప్పించి, వారి కాళ్ళమీద వాళ్ళను బ్రతికేట్టు చేస్తూ, బ్రతుకుకోసం ఒక భర్తమీద ఆధారపడక పోయినా, భగవంతునిపైన విశ్వాసంతో భగవంతునికీ, సమాజానికి సేవచేసే రీతిలో వాళ్ళ జీవితాలను మలచటం ఎంత వివేకవంతమైన పని? ప్రతి స్త్రీకీ ఒక పురుషుడు, ప్రతి పురుషునికీ ఒక స్త్రీ. సృష్టిలోనే యిమిడ్చిన ధర్మం. అది జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు కలిగే అనుబంధమే. ఓర్పు, సహనంవంటి మానసికమైన [illegible]లు వున్నప్పుడు ఎన్నో బాధలు, బాధలు కాకపోగా ఆనంద సుధా సింధువుకు చేరవేసే వాహినులవుతాయి "మన వేదనలన్నీ ఆనందజ్యోతికి నివేదనలు కావాలి" అన్నారు ప్రఖ్యాత తాత్త్విక రచయిత శ్రీ సూర్యదేవర సంజీవదేవ్ తమ రసరేఖల్లోనూ, లేఖల్లోనూ.

అమెరికాలో ఒక బిడ్డలులేని తల్లి తనకు బిడ్డలు లేరనే ఆవేదనను దుఃఖదాయకంగా మలచుకోలేదు. "అనాధులైన బిడ్డలంతా నా వారే" అనే గొప్ప బుద్ధితో బిడ్డలకు ఒక శరణాలయం ఏర్పరచి, వారికి సేవచేస్తూ ధన్యురాలయింది.

మానవ సంబంధాలలో "నెగిటివ్" (Negative) దృష్టి లేకుండా, "పాజిటివ్" (Positive) దృష్టిని నెలకొల్పితే అవన్నీ ఆత్మానందం అనే అమృతాన్ని కలిగించే దివ్యానుబంధాలే అవుతాయి.

# దధీచి మహర్షి

( గత సంచిక తరువాయి )

## వృత్రాసుర సంహారం

నర్మదా నదీ తీరంలో తిరిగి దేవాసుర సంగ్రామం జరిగింది. ఐరావతము నెక్కి, వజ్రాయుధాన్ని ధరించి ఇంద్రుడు యుద్ధసన్నద్ధుడైనాడు వృత్రాసురుని నాయకత్వంలో అసురులు విజృంభించారు కాని కొద్ది సేపటికే భీరువులై పారిపోసాగారు. వృత్రాసురుడు ఎన్ని హెచ్చరికలు చేసినా ఎంత బోధించినా, వారు నిలదొక్కుకుని పోరాడలేక పోయారు. పారిపోతున్న అసురులపై ఆయుధాలను ఇంద్రుడు ప్రయోగింపబూనుకొనేసరికి వృత్రాసురుడు మండి పడ్డాడు క్రోధంతో తన త్రిశూలంతో ఐరావతాన్ని తీవ్రంగా పొడిచాడు. దాని మస్తకం బ్రద్దలయింది. ఇంద్రుడు కలవరపడ్డాడు, ఢీలా అయిపోయాడు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని వృత్రాసురుడు అధర్మ యుద్ధం చేయదలచలేదు. ఇంద్రుడు తిరిగి బలాన్ని పుంజుకున్న తరువాతనే త్రిశూలంతో అతనిపైకి ఉరికాడు. మీదపడబోతున్న వృత్రాసురుని చేతిని ఇంద్రుడు నరికాడు. అంతమాత్రాన జంకక, రెండవ చేతితో దృఢమైన పరిఘను దేవేంద్రుని పైకి విసిరాడు అది ఇంద్రుని నడ్డిని తాకగా, అతడు విచలితుడై, చేతిలోని వజ్రాయుధాన్ని నేలపైకి జారవిడిచాడు. ఇది చూచిన వృత్రాసురుడు ఇంద్రుని హెచ్చరిస్తూ " నేలమీదనున్న వజ్రాయుధాన్ని తీసి నాపై ప్రయోగించమన్నాడు " దధీచి తపోబలాన్ని, నారాయణుని దివ్య తేజస్సును తనలో నింపుకోవాలన్న ఆ ఆయుధమే తనను అంతము చేయాలన్నది అసురుని వాంఛ కాబోలు వృత్రాసురుని ధీరత్వానికి, పరిపూర్ణ ప్రజ్ఞకు, జ్ఞానవైశిష్ట్యానికి ఆశ్చర్యపోయిన ఇంద్రుడు అభినందనలు కురిపించాడు తనపై విరుచుకు పడుతున్న పరిఘను వజ్రాయుధంతో తునాతునియలు చేసి, దానిని విసిరిన రెండవ చేతిని కూడ ఖండించాడు వృత్రాసురుని రెండు బాహువులు తెగిపడినా చలించక మరింత రౌద్రంతో, పర్వతగుహలాంటి నోరు తెరచి, క్రింద పెదవిని భూమిపై నుంచి, పై పెదవిని స్వర్గానికి తాకించి, ఐరావతంతో సహా ఇంద్రుని మ్రింగివేసాడు ఈ సాహసకార్యాన్ని చూచి, దేవతలు హడలిపోయి పారిపోసాగారు వృత్రాసురుని కడుపులోకి వెళ్లిన ఇంద్రుడు వజ్రాయుధంతో అతని పొట్టను చీల్చి, బయటపడ్డాడు. వింధ్యాచలం వలె అసురుడు నేలకొరిగాడు అయినా చావలేదు బయటకు వచ్చిన ఇంద్రుడు అసురుని శిరస్సుచుట్టూ తిరిగి, దానిని శరీరాన్నుంచి వేరుచేశాడు. ఆ సమయంలో శంఖ, చక్ర, గదా పద్మ ధారియగు వనమాలి నవ్వుచూ అసురుని ప్రక్కనే నిలబడిఉన్నాడు ఆ శ్యామసుందరుని తదేక దీక్షతో చూస్తూ వృత్రాసురుడు అసువులు విడిచాడు. అతని శరీరం నుండి పరమ ప్రకాశవంతమగు జ్యోతి వెలువడి, వాసుదేవునిలో లీనమయింది. దేవతలు దుందుభులు మ్రోగించారు ఋషులు దేవేంద్రుని స్తుతించారు. గంధర్వులు గానం చేశారు, అప్సరసలు నృత్యాలు చేశారు. దశదిశల అన్ని లోకాలలో ఆనందం వెల్లివిరిసింది. వృత్రాసురుడు సద్గతిని పొందాడు.

## దధీచి కుమారుడు పిప్పలాది మహర్షి

దధీచి శరీర త్యాగం చేయగనే, అతని భార్య సహగమనం చేయదలచింది కాని గర్భవతిగానున్నందు వలన, ముందుగా తన పొట్టను చీల్చి, ఎనిమిది నెలల పసికందును, వెలికితీసి, అశ్వత్థ వృక్ష మూలమున పరుండబెట్టి, సూర్యచంద్రాది గ్రహములను, పశు పక్షి వృక్షాదులను బిడ్డను కాపాడుమని ప్రార్థించి, దధీచికి చెందిన వస్తువులను తీసుకుని ఆమె అగ్నికి ఆహుతి అయింది. ఆ పిప్పల వృక్షం నుంచి రాలిన పండ్లను తిని, శరీరాన్ని నిలుపుకున్నందున, దధీచి కుమారుడు పిప్పలాది మహర్షిగా ప్రసిద్ధిచెందాడు. పెద్దవాడై, తల్లితండ్రుల మరణానికి కారకులైన దేవతాసమూహములపైకి దండెత్తగా, శంకరుడడ్డుపడి పరోపకారమై అతని తండ్రి దధీచి చేసిన లోకోత్తర త్యాగాన్ని అతనికెరుకపరచి, శాంతింపచేశాడు.

ఈకథలో మనము గుర్తించాల్సినది, దధీచిమహర్షి, పరోపకారపారాయణత, లోక హితాన్ని కోరి చేసిన అపూర్వ శరీర త్యాగము ఇంద్రుని స్వార్థపరత్వము డంభ అహంకారాలు, గురుతిరస్కారము, విశ్వరూపుని నిష్కారణముగ సంహరించుట, అసురుల వలన దేవత లనుభవించిన కష్టపరంపరలు. వృత్రాసురుడు కారణజన్ముడై, దేవతలపై పోరినా, ధర్మమువీడక భగవంతుని మరువక, దైవశక్తివలననే తాను హతుడై పరమపదముపొందాలన్న ఆకాంక్షతో వ్యవహరించి తుది శ్వాస విడుచునప్పుడు, దైవమును ఎదురుగా నుంచుకొని చూస్తూ, సద్గతిని సాధించుకొనుట



( 3 వ పేజీ తరువాయి )

ఈనాడు ఈ విమర్శనలు చేసేవారెవరూ ఒక్క నయాపైసాకూడా సత్యసాయి సంస్థలకు ఇచ్చి ఉండరు. ఆ మాటకు వస్తే స్వదేశీయులు యిచ్చే విరాళములు కూడా బహుస్వల్పమే. విదేశీయులు ఇచ్చే విరాళములే ఎక్కువ. ఆలోచన చేయకుండా గుడ్డిగా వందలాది కోట్ల రూపాయలు భారత దేశంలోవున్న ఒక గ్రామానికి యిస్తున్నారని ఈ విమర్శనలు చేసేవారు భావిస్తున్నారా ? ఒకవేళ ఆ విధంగా భావించుతే అది వారి అవివేకమే అవుతుంది. విదేశీయులు విశాలభావంతో విరాళములు యిస్తుంటే సంతోషించటానికి బదులు అసూయతో విమర్శనలు చేయటం ఏమాత్రం విజ్ఞత అనిపించుకోదు. వారు చేయరు, చేయలేరు. చేసేవారిని చూచి ఈర్ష్యతో విమర్శిస్తుంటారు. అట్టి అవివేకులను అసూయాపరులను, కుత్సిత స్వభావంగలవారిని, తుచ్ఛిత స్వభావం గలవారిని ఏమని పిలవాలో సరియైన పదము ఏ డిక్షనరీలో వెతికినా కనిపించదు. ఇలాంటివారివలన సమాజంలో నీతి న్యాయాలు పూర్తిగా అంతరించుకు పోతాయనడంలో సందేహం లేదు. అందువలననే స్వామి ఒక పర్యాయం ఇలా అన్నారు.

దుర్బుద్ధుల తలలున్న; దూరులువిను చెవులున్న
పొంచిచూచు కనులున్న ; పంచలవిను మనసున్న
వంచనగుణ చిత్తమున్న; వంచించే పలుకున్న
ఈ వికృతులు చూడగానే న్యాయమిక
బ్రతుకదన్న
ఏ గుణమును హృదయంబున నిలువదన్న.

అన్నారు. ఇలాంటి వారి భావాలు మారనంతకాలం వారికి అన్నీ వక్రంగానే కనబడతాయి అది వారి దృష్టిలోపమే కాని సృష్టిలోపం కానేకాదు వక్రదృష్టి మారనంతవరకు సత్యం గోచరించదు. వివేకుడే వివేకాన్ని గుర్తించటానికి వీలవుతుంది కాని అవివేకుడు వివేకాన్ని గుర్తించలేడు చంద్రుని చంద్రునికాంతితోనే చూడగలం గాని వేరొక టార్చి, లాంతరు సహాయంతో చూడలేము స్వామి దివ్యత్వాన్ని చూడాలంటే వికృతి భావాలు కల మనస్సులకు, మలిన భావాలు కల మనస్సులకు సాధ్యమయ్యేది కాదు.

ఇక పోతే సాయి ట్రస్టులో భేదాభిప్రాయాలున్నాయని, ఆధిపత్యంకోసం జరిగే పోరాటమని, అధికారం కోసం పెనుగులాడుతున్నారని, ఈ దుస్సంఘటనకు వీరే బాధ్యులని అభాండాలు వేస్తున్నారు. అసలు బాబా సంస్థలకు అప్రదిష్ట వస్తే నష్టపోయేది ఎవరు ? బాబా చేపట్టిన అభ్యుదయ కార్యక్రమాలకు అవరోధం ఏర్పడితే పరువుపోయేదెవరికి ? ఈ మాత్రం ఇంగిత జ్ఞానం ట్రస్టువారికి లేదని విమర్శనలు చేసేవారు భావిస్తున్నారా? బాబా మీద భక్తిశ్రద్ధలతో, ఎట్టి ఫలితాన్ని ఆశించకుండా, నిస్వార్థంగా సేవ చేస్తున్న వారి మీద నిందలు మోపటం, అభాండాలు వేయటం ఏమాత్రం వివేకం అనిపించుకోదు. ఇది వివేకం, విజ్ఞత లోపించిన వారి ప్రచారం తప్ప మరొకటి కాదు

ఇకపోతే భగవాన్ బాబావారి దివ్యత్వాన్ని, పవిత్రతను శంకిస్తూ ప్రకటనలు కూడా వీరు చేస్తున్నారు. ఆనాడు శ్రీరాముని విమర్శించినవారూ ఉన్నారు. శ్రీకృష్ణుని దివ్యత్వాన్ని శంకించినవారూ ఉన్నారు.

# విదురనీతి

" ఇజ్యాధ్యయనదానాని
తపః సత్యం క్షమా ఘృణా
అలోభ ఇతి మార్గోఽయం
ధర్మ స్యాష్టవిధః స్మృతః "

యజ్ఞము, అధ్యయనము, దానము, తపస్సు, సత్యము, ఓర్పు, దయ లోభము లేకుండుట అను ఎనిమిది గుణములు ధర్మమునకు ఎనిమిది విధములైన మార్గములుగా చెప్పబడినవి.

ఈర్ష్యతో, అసూయతో తుదముట్టించాలని ప్రయత్నించిన వారూ ఉన్నారు. అయితే ఏమి జరిగింది? అట్టివారు కాలగర్భంలో కలిసిపోయారు. నికృష్టమైన, నీచమైన చావును చవిచూచారు. ఈనాటి విమర్శనలు, నిందలు, అభాండాలు భగవాన్ బాబావారి దివ్యత్వాన్ని ఏమాత్రం తగ్గించలేవు, పైపెచ్చు వారి దివ్యశక్తి ఇంకా ఇనుమడించి ప్రపంచ శాంతికి దోహదం చేస్తుంది. ఇది యదార్థ నగ్న సత్యం. ఎవరు మాటలు చెప్పేవారో ! ఎవరు చేతలు చేసేవారో ! ఎవరు కల్లబొల్లి కబుర్లు చెప్పి మోసగించేవారో! ఎవరు బీద, పేద ప్రజలకు వాస్తవంగా ఉపయోగ పడేవారో! ఈ సమాజం గమనిస్తూనే ఉన్నది. రామాయణ మహాకావ్యాన్ని,మహాభారతాన్ని విమర్శిస్తూ ప్రతి శతాబ్దంలోనూ ఎన్నో గ్రంథాలు వచ్చాయి. కాని బహుస్వల్ప కాలంలోనే అవి కాలగర్భంలో కలిసిపోయినాయి రామాయణ మహాభారతాల ప్రాముఖ్యత మాత్రం నానాటికి పెరుగుతున్నది గాని ఏమాత్రం తరగటం లేదు కమ్యూనిష్టు దేశమైన రష్యాలోని ప్రజలమీద కూడా వాటి ప్రభావం ఊహించని విధంగా పడింది. కారణం ? ప్రముఖ జర్మన్ పండితుడు వింటర్ నిడ్జ్ చెప్పాడు. " శతాబ్దముల తరబడి జాతి యొక్క విచారధారను, కావ్య ప్రపంచమును, యింతగా ప్రభావితమొనర్చిన మరియొక కావ్యం ప్రపంచముననే సాహిత్యమునకు కానరాదు భారతదేశములోని అన్ని తరగతులకు చెందిన ప్రజలలో ఈ మహాకావ్యములు వేలాది సంవత్సరాలైనప్పటికీ జీవించి ఉండగలవు. గొప్పవారు, తక్కువవారు, ధనవంతులు, పేదలు;రాజు, రైతు, వణిజులు, వివిధ వృత్తులచే జీవించువారు - అందరకు ఈ మహా కావ్యములలోని విషయాలు, పాత్రలు ప్రేరణను, ఉత్తేజమును కలిగిస్తాయి " అని పేర్కొనినాడు. అదే విధంగా భగవాన్ బాబాను చిన్నప్పటినుంచి విమర్శించే నాస్తికులు కోకొల్లలు వారందరూ ఏమైనారు ? ఆ విమర్శ వలన బాబాకు ఏమైనా ప్రతిష్ఠ తగ్గిందా ? పైపెచ్చు పెరుగుతున్నది. ఇది కర్మభూమి, ధర్మభూమి, వేదభూమి, పవిత్రభూమి. ఈ ధర్మాన్ని ఆదరించి, ఆచరించి, అనుసరించేవారికే కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి భగవాన్ బాబావారు సనాతన ధర్మసముద్ధరణకు దివినుండి భువికి దిగివచ్చారు. వారిని ఏ దుష్టశక్తీ ఎదుర్కొనలేదు. ఎదుర్కొనటానికి ప్రయత్నించుతే అగ్నిలో పడిన శలభాల గతేపడుతుంది.

ఇకపోతే ఇటువంటి దుస్సంఘటన ప్రశాంతినిలయంలోనే జరగటమేమిటని కొంతమంది సంశయాలను వెలిబుచ్చుతున్నారు. ఎవరికి, ఎక్కడ, ఎప్పుడు కాలంచెల్లుతుందో, విధివ్రాతను ఎవరూ తప్పించలేరు. ఇది ఆధ్యాత్మిక దృష్టి. భౌతిక దృష్టిలో దర్యాప్తు జరుపవల్సిందే. దీనిని ఎవరూ కాదనరు ప్రభుత్వం అట్టి దర్యాప్తును చేబట్టింది. దర్యాప్తుచేసి దోషులను శిక్షించడానికి ఎవ్వరూ వ్యతిరేకులు కారు. అందులో ప్రపంచ విఖ్యాతగాంచిన సాయిసంస్థను అప్రదిష్ఠపాలుచేయటానికి కారణభూతులైనవారిని కఠినంగా శిక్షించాల్సిందే. ఈ విషయంలో ఎవరికీ భేదాభిప్రాయం లేదు అయితే ఈ సంఘటనను ఆసరాగాతీసుకొని భగవాన్ బాబా వారి మీద నిందలు, అభాండాలు వేస్తే మాత్రం ఎవరూ సహించరనే విషయం గమనించాలి. సరిఅయిన రీతిలో విచారణ చేసి, సక్రమమైన దృష్టితో చూచిననాడే సత్యం గోచరిస్తుంది రంధ్రాన్వేషణ చేసేవారికి ఏనాటికీ సత్యం గోచరించదు. ఒకపర్యాయం శ్రీకృష్ణుడు ధర్మరాజుని పిలిచి "నాయనా ! ఈ భూప్రపంచంలో దుర్మార్గులెవరయినా ఉన్నారేమో చూచి నాకు చెప్పు " అన్నాడు అదే

విధముగానే దుర్యోధనుని కూడా పిలిచి "నాయనా! ఈ జగత్తునందు ఎవరయినా సన్మార్గులు ఉన్నారేమో చూచి నాకు చెప్పు" అన్నాడు. కాని అది ఇద్దరికీ సాధ్యపడలేదు ధర్మరాజుకి దుర్మార్గులు కానరాలేదు. దుర్యోధనునికి సన్మార్గులూ కానరాలేదు కారణం! వారియొక్క దృష్టి, దృష్టి ఎలాంటిదో సృష్టి అలాంటిది వక్రభావాలు, మలినభావాలు, తుచ్ఛభావాలు కలవారికి జగత్తంతయూ అదే విధంగా కన్పిస్తుంది ఏ రంగు కంటి అద్దాలు పెట్టుకుంటామో జగత్తంతయూ అదే విధంగా గోచరిస్తుంది చెడు ఉన్నదేమోనని వేలెత్తి చూపటానికి నిరంతరం ప్రయత్నిస్తుంటారు మంచి ఎంతగా చెప్పినా అంగీకరించలేరు అందువలననే ఒక పర్యాయం బాబా ఇలా అన్నారు.

మంచి మాట వినరు మనసిచ్చి చెప్పిన
చెడ్డ మాట ముందు చెవిని పడును
ఇట్టివారు నన్ను ఎరుంగ నేర్తురే
ఎట్టి తెలివియున్న నేమి ఫలము?

ఇటువంటివారు ఎన్ని తెలివితేటలను కలిగిఉన్నప్పటికినీ వారి భావాలుమారనంతకాలం వారుబాబాని తెలుసుకోలేరు.

"ఆకలి బాధతో నల్లాడు సమయాన
విందుభోజనము ప్రాప్తించినట్లు
దారిద్ర్యభారాన దందడిల్లెడు నాడు
ముంగిట నవనిధుల్ పొంగినట్లు
వంశాభివృద్ధికై పరితపించెడి నాడు
పుత్రులు జంటగా పుట్టినట్టి
దాహతీవ్రతతోడ తల్లడిల్లెడు వేళ
పెను ఒయాసిస్సు కన్పించినట్లు
ధర్మము వినాశ మగునట్టి తరుణమందు
గగన కుసుమంబునై శాంతి మిగులునాడు
సత్య మణగారి క్రిందికి జాదు నాడు
సాయి జనియించె ప్రజకు విశ్రాంతి గూర్ప"
— తాళ్ళూరి సత్యనారాయణ

ఈనాడు హేతువాదులు, నాస్తికులు, సామ్యవాదులు అభ్యుదయవాదులని ప్రగల్భాలు పలికేవారికన్నా మించిన సామ్యవాది బాబా. మానవత్వం మూర్తీభవించిన మానవతావాది బాబా యదార్థవాది బాబా. ప్రేమమూర్తి బాబా. పవిత్రమూర్తి బాబా ఈనాడు సామ్యవాదం ముసుగును తగిలించుకుని తీయనిమాటలు చెబుతున్నారేగాని, వాస్తవంగా చేసి చూపించేవారు లేరు. బాబా చేసిందే చెబుతారు. చెప్పిందే చేస్తారు. విద్య, వైద్య, సేవారంగములలో బాబా చేస్తున్న కృషే దీనికి నిదర్శనం. ఇటువంటి కరుణామూర్తి మీద నిందలు మోపటం, అభాండాలు వేయటం ఏమాత్రం విజ్ఞత అనిపించుకోదు చేతనైతే వారి శక్తిని, యుక్తిని ఉపయోగించి ఈ కుట్రకు వెనుకనున్న అదృశ్యహస్తాలను బట్టబయలు చేస్తే సంతోషిస్తారు. అది చేయకుండా కేవలం బాబా సంస్థలను అప్రదిష్టపాలు చేయటానికి ప్రయత్నించుతే - ఈ చర్యను మానవతావాదులెవరూ సహించరు. కనుక బాబాపై విమర్శనలు చేసేవారు ఈ వాస్తవమును గుర్తించి, పరివర్తించటం సముచితం.

0

## కృతజ్ఞతాభివందనములు

ది 30-7-93 న మచిలీపట్నంలో జరిగిన మా జ్యేష్టకుమారుడు చి॥ చంద్రశేఖర్ మరియు ది. 1-8-93 న మచిలీపట్నంలో జరిగిన మా కనిష్ఠ కుమార్తె చి॥ విజయగౌరిల వివాహములకు విచ్చేసి, వధూవరులను ఆశీర్వదించిన పెద్దలకు, శుభాశిస్సులు పంపిన ప్రముఖులకు మా కృతజ్ఞతాభివందనలు

ఇట్లు
కొమరగిరి కృష్ణమోహన రావు
జయప్రద

# పనికిరాని పరిజ్ఞానం

-చింతపల్లి అన్నపూర్ణ

మీకు యీ సంగతులు తెలుసా ? ఇది అంతా పనికిరాని పరిజ్ఞానం.

కేంబ్రిడ్జిలోని వీధుల్లో టెన్నిస్, ఆడటం నేరం. ప్రఖ్యాత హాలివుడ్ నటులు మైఖెల్ కెయిన్, పీటర్, సెల్లర్స్ యిద్దరి గొంతులూ (Voice) ఒకేలాగా వుంటాయి తెలుసా ?

గ్రీక్ జాతీయగీతంలో 158 పద్యాలు ఉన్నాయి. నూనె, నీరూ కలిసిపోవాలి అంటే ఒక్క రవ్వ సబ్బు కలిపితే చాలు రాసే మొదటిలో ఉత్తరాలు అందుకున్న వారు (Recipent) స్టాంపు డబ్బులు చెల్లించేవారు. రష్యాలో టాక్సీలు పరిశుభ్రంగా లేకపోతే టాక్సీ డ్రైవరుకు జరిమానా వేస్తారు. బ్రిటన్‌లో అధికంగా హోటళ్ళకు వుండే పేరు 'ది రెడ్ లయన్'.

ఒకనాటి ప్రపంచపు బిల్లియర్డ్స్ ఛాంపియన్ అయిన జోడేవిస్‌కి ఒక కన్ను మాత్రమే కనిపిస్తుంది. జాపనీస్ భాషలో "కరాటే" అంటే 'Empty Hand' (ఒట్టి చేతులు) అని అర్థం. కరాటే జాపనీస్ జాతీయ క్రీడ (National Sport) అని చాలామంది అనుకుంటారు. కానీ నిజానికి అది జపాన్‌లో 1920 లో ప్రవేశపెట్టబడింది. లాటిన్ అమెరికా దేశాలలో ఒకటి అయిన ఉరుగ్వేలో నేటికీ ద్వంద్వయుద్ధం చట్టబద్ధమే

ఒకనాటి ఇంగ్లండు మహారాణి అయిన విక్టోరియా మహారాణికి ఇంగ్లీషు సరిగ్గా రాదు. ఆమె మాతృభాష జర్మన్. ఆమె పెళ్ళిరోజు ఆమెకు ఒక అరటన్ను జున్ను బహుమతిగా యివ్వబడింది. వారం రోజుల తరువాత శాండ్రింగ్‌హామ్‌లో ఏడవ ఎడ్వర్డు అతిధులు అందరూ బరువు తూచబడ్డారు ఆ జున్ను మొత్తం తిని బరువు ఎక్కారో లేదో అని వాళ్లు అందరూ బరువు తూచబడ్డారు

1953 జూన్ 2 ఎలిజబెత్ మహారాణి పట్టాభిషేక దినంగా ప్రకటించబడింది. ఎందుకు అంటే వాతావరణ శాస్త్రజ్ఞులు (Metorologists) 'ఆ రోజు వర్షం కురవదు' అని వెల్లడించారు కానీ ఆ రోజు వర్షం కురిసింది. Sun King (సూర్యరాజు) గా ప్రసిద్ధి చెందిన ఫ్రాన్సురాజు 14 వ లూయీ వృద్ధాప్యంలో చాలా అవస్థ పడ్డాడు—ఆయన కాలి వేలు ఒకటి ఊడి పోయింది.

మీ శరీరంలోని రక్తనాళాలు అన్నీ కలిసి 95,000 కిలోమీటర్ల పొడుగు ఉంటాయి అందులో సెకనుకి 1 కోటి యాభై లక్షల రక్తకణాలు మరణిస్తుంటాయి, తిరిగి అన్ని రక్తకణాలు తిరిగి పుడుతుంటాయి మీరు రోజుకు 25,000 సార్లు కండ్లు ఆర్పుతారు మీరు కోప గించినప్పుడు 43 కండరాలు ప్రకోపిస్తాయి కానీ నవ్వినప్పుడు 17 కండరాలే ప్రకోపిస్తాయి. మీ ముక్కు మీ జీవితాంతం పెరుగుతూనే వుంటుంది. ఒకరి నాలుక ఉన్నట్లు మరియొకరి నాలుక ఉండదు. ఒక్కొక్కరి నాలుకా ఒక్కొక్క పద్ధతిలో ఉంటుంది.

లాంగర్‌హాన్స్ దీవులు పిక్‌నిక్ స్పాట్‌లు కావు. అయితే అవి పాన్‌క్రిస్‌లో వున్న దిబ్బలు.

ప్రపంచంలో ఎక్కువమంది పెట్టుకునే పేరు "మహమ్మద్".

రోమ్‌లో, గ్రీస్‌లో ఉన్న తెలుపు విగ్రహాలు అన్నీ ఒకనాడు రంగులతో పెయింట్ చేయబడినవే. కాలక్రమేణా అవి ఆట్లాగ అయిపోయినాయి. ఒకనాటి రోమన్ చక్రవర్తి సంగీత విద్వాంసుడూ అయిన నీరో ఉల్లిపాయలు తెగ తినేవాడు. తన కంఠం శ్రావ్యంగా మారడానికి.